# ఆత్మవంచన

[ నాటకం ]

బుచ్చిబాబు

దేశికవితామండలి
విజయవాడ - 2

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
నవంబరు '51
కిషాన్ ప్రెస్
విజయవాడ —
రూపాయి పావలా



సంపాదకులు

బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

★ అంకితం : ★

అధిక ప్రయాసలతో ఘోరంగా నైనాసరే
యీ నాటకాన్ని ప్రదర్శించేవరకు నిద్రపోని

★ 'రామం'కి ★

## పాత్రలు

### పురుషులు

రాజశేఖరం : కలెక్టరుగారింట్లో వుండి చదువుకుంటున్న వారాలబ్బాయి.

గోపాలం : శాంతమ్మగారి మేనల్లుడు.

సూర్యనారాయణ : ఫామిలీ ఫ్రెండ్

కరుణాకరం : వారాలబ్బాయి స్నేహితుడు.

రెడ్డి : వారాలబ్బాయి ఆంతరంగిక స్నేహితుడు.

చిట్టన్న : కలెక్టరు గారింట్లో నౌకరు.

### స్త్రీలు

శాంతమ్మ : కలెక్టరుగారి రెండోభార్య.

కౌముదీరాణి : కలెక్టరుగారి పెద్దకూతురు.

వాణి : కలెక్టరుగారి రెండోకూతురు.

పూర్ణిమ చంద్రికాబోస్ : బెంగాలీకన్య.

1948 జూన్‌లో ఆలిండియా రేడియో, మద్రాసు కేంద్రంనుంచి గంటనాటికగా ప్రచారమైంది.

1950 ఏప్రిల్ కాకినాడలో జరిగిన ఆంధ్రనాటక కళా పరిషత్తు నాటకపోటీలలో ప్రదర్శించబడి ఉత్తమ రచన బహుమానం పొందింది. తర్వాత నాలుగైదు సార్లు ప్రదర్శన జరిగినప్పుడు చూసిన మీదట యీ నాటకం ప్రస్తుత రూపం పొందింది. నాటక కళాపరిషత్తు నాటక పోటీలలో ప్రదర్శించినప్పటి నటీనట బృందం:

1. రాజశేఖరం : శ్రీ పుండరీకాక్షయ్య
2. గోపాలం : శ్రీ మోహన్
3. సూర్యనారాయణ : శ్రీ సూర్యనారాయణ
4. కరుణాకరం : శ్రీ ఫాలలోచనరావు
5. రెడ్డి : శ్రీ వసంత కుమార్
6. చిట్టన్న : బి. యస్. యన్. శర్మ
7. శాంతమ్మ : సీతమ్మ
8. కౌముదీరాణి : మల్లికాంబ
9. వాణి : ఆర్. నిర్మల
10. పూర్ణిమ చంద్రికాబోసు : సావిత్రి



# ఆత్మవంచన

## [మొదటి అంకం]

సమయం—రాత్రి, మే [illegible] వ తేదీ

స్థలం—పట్నంలో కలెక్టర్‌గారి బంగళా

[తెర తీసేటప్పటికి శాంతమ్మగారు బల్లమీద ఏదో తడుముతూ కనపడుతుంది. కొంచెం పాతకాలపు మనిషి—పెద్దపూలబార్డరుచీర, మధ్యపాపిడి [illegible] తెచ్చే గుర్తులు—ఏదో జ్ఞాపకం తెచ్చుకుని [illegible].

స్టేజ్ రెండుభాగాలయ్యేటట్లుగా మధ్యన ఓ స్క్రీను. పెద్దభాగం హాలు. అందులో ఓ పెద్ద బల్ల, రెండు మామూలుకుర్చీలు, ఓ సోఫా వుంటాయి. రెండోది చిన్నగది—అందులో బల్ల, షవర్ [illegible], ఫోటోస్టాండ్, కార్నర్ టేబిల్, పుస్తకాల ర్యాక్. [illegible] బల్లమీద 'వీణ' వుండే పాతమోడల్ గ్రామఫోను. [illegible] సోఫాలో కూర్చుని పుస్తకానికి అట్ట వేస్తూవుంటుంది. వాణికి [illegible] పదిహేడు—సన్నగా, పొడుగ్గా వుంటుంది. బాగా ఎఱుపు. కొంచెం పొట్టిగా గుండ్రంగా కనబడే మెడ—కోలమొహం, [illegible] వాలుగా వుండే జడ. నవ్వుతున్నట్లుగా వుండే పెదవులు. కొంటెగా చూసే కళ్లు—మొత్తంమీద నిదానంగా చూస్తేనే గాని ఆకర్షణీయంగా కనబడదు.]

శాంతమ్మ: రాణీ యేదే?

వాణి: శారదగారింటికి వెళ్లింది—

శాం: నిన్ననేగా వూళ్ళన్నీ తిరిగొచ్చారు, అప్పుడే షికార్లా?

వాణి: షికార్లు కాదే—వాళ్ళ పరిక్షాఫలితాలు తెలుస్తాయి టీవాళ, —అక్కయ్యా, శారద ఇందిర్ని చూడ్డానికి సికింద్రాబాద్ వెళ్లాలని ఎత్తేస్తున్నారేవ్.

శాం: నిన్ను తీసుకెళ్ళడం లేదనా? తిరగండమ్మా, మీయిష్టం వొచ్చినట్లు—శెలవ నాలుగురోజులూ నాదగ్గరుండి ఇంటిపన్లు చూసు కోవాలనేగా మీ బెంగ?

వాణి: అమ్మా, ఎప్పుడూ యిల్లుయిల్లంటూ కూర్చుంటావు. నువ్వు దేశం అంతా ఎప్పుడు చూస్తావే? అమ్మా; మహాబలేశ్వరంలో సమ్మర్ ఎంత బాగుంటుం దనుకున్నావు? షికార్లు చేసినా అక్కడ చెయ్యాలి. నిన్ను రమ్మంటే వొచ్చావు కాదు.

శాం: మీతోపాటు నేను షికార్లు చేస్తే, యిల్లూ, ఘామలూ ఎవరు చూస్తారమ్మా? మనకి మగ దిక్కెవరూ లేకపోయె,

వాణి: అదేవిటే అమ్మా, అలాగంటావ్? నేనున్నాను, అక్కయ్యుంది—ఐనా మనకేం లోటు?! మేం వచ్చామని తెలిస్తే గోపాలం బావ ఎగిరి చక్కావస్తాడు. వారాలబ్బాయ్ వుండనే వున్నాడుకదా?

శాం: తప్పమ్మా వాణీ—అతను పెద్దవాడై పెద్దచదువు చదువుతున్నాడా మరి,—వారాలబ్బా యనకూడదమ్మా.

వాణి: అవునమ్మా...తప్పే. మరచిపొయ్యాను—ఏదో అలవాటు చొప్పున అల్లావచ్చేస్తుంది, ఆనర్సుఫలితాలుకూడా యివాళో రేపో రావాలి—వారాలబ్బాయ్.... కాదు, క్షమించు, రాజశేఖరం ... ఎల్లా వ్రాశాడో?

శాం: బాగానే రాశాట్ట,

వాణి: ఎక్కడ కెళ్లాడు, కనబడ్డేం?

శాం: ఫ్రెండ్స్‌ని చూసొస్తానని వెళ్ళాడు. నాలుగు రోజులైంది,

అమ్మాయిగార్లు వొచ్చేలోగానే వొస్తానన్నాడు. నాకు నవ్వొచ్చింది. "ఆడ పిల్లలు నీకంటే చిన్నవాళ్లు. యింకా 'అమ్మాయిగార్లు' ఏమిటోయ్" అన్నాను. పాపం, ఎంత చదువు చదివినా, భయభక్తులతో మసులుతాడు.

వాణి : ఏమీ మారిపోలేదే? అబ్బో, నేను చూసి అప్పుడే రెండేళ్ళయిందేమో ? ఆనర్స్ ప్యాసయింతర్వాత ఏం చేస్తాట్ట ?

శాం : ఏమో, నాకుమాత్రం ఏం తెలుస్తుంది ? మీ నాన్నగారి కోర్కె ప్రకారం, చివరంటా చదువులు చెప్పించాం, అతని అదృష్టం ఎల్లా వుందో యింతకీ ?

వాణి : కారుడ్రైవింగ్ నేర్చుకుంటే మన కొత్తకారుని డ్రైవ్ చెయ్యమందుంగా.

శాం. అదేవిటే, తప్పు కాదూ ?

వాణి : తమాషా కన్నానే—వుండు, పోనీ—మరోటి సజెస్ట్ చెయ్యనా ? భూములూ ఆస్తులూ చూస్తూవుంటాడు.— మేనేజ్‌మెంటు చేసే ఆంతరంగిక కార్యదర్శిగా పెట్టుకుంటుం దక్కయ్య నడిగితే.

శాం : నీమొహం; వూరుకో—దాంతో అనేవుగనక. వెళ్ళి అతని మొహంమ్మీదనే అనెయ్యగల్దు.

వాణి : అమ్మా, నాకు తెలీ కడుగుతాను, ఏవి టాభయం నీకు ? మనింట్లో వారాలు చేసుకుని, కర్మంజాలక పరీక్షలు ప్యాసైన రాజశేఖరాన్ని కలెక్టరుగారిలాగో, జమిందార్‌లాగో చూడాలంటావు—ఏవిటి ఆపిచ్చి నీకు ? అక్కయ్యదగ్గర యీమాట నేనన్నానంటే దూదేకినట్లు ఏకిపాదేశి, ఆదూదితో పరుపుకుట్టించుకుంటుంది కూడా—

శాం : ఊరుకుందూ—నువ్వూ నీ వేళాకోళమూను, ఏరా చిట్టన్నా —ఏమైంద్ది కార్ లైసెన్సు ?

[ప్రవేశం చిట్టన్న—షుమారు ముప్ఫైయ్యేళ్ళు. బిళ్ళగోచీ పోసి పంఛకట్టు—మోకాళ్ళమీద కుంటుంది. పొట్టి చేతుల లాల్చీ—నొక్కేసి నట్టుగా వుండే మొహం.]

# ఆత్మవంచన

చిట్టన్న: రాజబోటకంగా వొచ్చి ఏమ్యోగాగతాలుపెడ సంతకాలు పెడితేకాని యిప్పారంటండి.— ఆడ వేపోస్తారు సదాటండి—రేపు తెచ్చుకొందాంలెండి.

వాణి: అబ్బో! యీ రాజాగా రొస్తేకాని బ్రాముల. కాళ్లు కదల వన్న మాట.

శాం: (కసిరి) ఊ—వాడితో ఏమిటే! సరేలే, సరేలే చూసుకో చిట్టన్నా, రాణమ్మగారి గది సర్దు, కింద కాగితాలూ, చెత్తా, ఏమున్నా కనిపించిందా, నీ పీక నులిమేస్తుంది.

చిట్టన్న: పాపం, ఆమె నల్లా గంటూరుకాసండి—రాణమ్మగోరు చాలా మంచోరండి. నన్నేమి అన్రండి—ఎప్పుడేనా కోపంవస్తే. సెవులు మెలెట్టడం, గుంజీలు తీంచడం—అంతేనండి.

వాణి: ఏడిశావులే—పో—వెళ్ళి ఆ గ్రామఫోనుహారన్ సొట్ట పడింది ప్రొద్దున. ఆ సొట్ట తియ్యి.

చిట్టన్న: ఇంకా మనింటో యీ గొట్టం గ్రామపోనేంటండి—మొన్న సూర్నారాయణగారింట్లో పెట్టి పోసిగ్రాపు చూశానండి—భలేగా వుందండి—దానికి తలుపులు, కంతలు ఎయ్యాల్సించెనండి—ఎక్కణ్ణుంచి మోగుద్దో సిత్రం. మా రాణమ్మగారు సూత్తే సుంచున్న పళంగా కొనేద్దురండి,

శాం: నారాయణగారు వూళ్ళో వున్నారా?

వాణి: ఏ నారాయణే? సూర్యనారాయణా?

శాం: అవును. రోజూ వొచ్చి ఏమి రాశారా అని అడిగి పోతుంటాడు. ఈ మధ్య రెండు రోజుల్నుంచి రావటం లేదులే—వూళ్ళో లేడేమో?

చిట్టన్న: (పక్కగదిలో [illegible] మాట్లాడుతూ) ఉన్నారండి, నిన్ననే వొచ్చారండి?

వాణి : ఆ గొట్టం తగులడుతుంది చిట్టన్నా. అక్కయ్య చూసిందంటే, మళ్లా తలకాయ యివతలకి వూడిరాకుండా అందులో తాపడం చేసేస్తుంది. (తలుపుచప్పుడు) చిట్టన్నా, చూడు, పోస్టుబంట్రోతేమో ?

(చిట్టన్న వెడతాడు)

శాం : అక్కయ్యేమో !

వాణి : అక్కయ్య హారన్ మోగించకుండా దిగుతుందీ ! ఓవేళ లైసెన్సు లేకుండా వెళ్ళినందుకు కారులాక్కుంటే నడిచొచ్చిందేమో ? పోస్టే,

చిట్టన్న : చూశారంటండీ—పోస్టువాడు. ఉత్తరాలు తీసుగోటానికి మొగాడెడితే, 'పోస్టు' అని ఏడుస్తూ యిస్తాడు. అదే ఆడోరు వెడితే. 'పోస్టె' అని దర్జాగా యిస్తాడు.

శాం : (నవ్వుతూ) చిట్టన్నా, నువ్వు నాటకాల్లో చేర్రాదూ ?.... ఎక్కణ్ణుంచే వాణీ ?

చిట్టన్న : మీతో సెప్పలేదు—మొన్న శేఖరంగారు వో నాటకం ఆడించారండి. అందులో నాకు 'సిత్తం' 'సిత్తం' అనే వేషం యిప్పించారండి. భలే రకితికట్టిందండి.

శాం : ఎప్పుడ్రా—నాకు తెలీదే ?

చిట్టన్న : కూకిలేస్తారని చెప్పలేదండి.

వాణి : అమ్మోయ్. - బావొస్తున్నాట్ట—గోపాలం బావ...పరీక్ష చిట్టన్న తలకాయలా గుండ్రంగా గుండుసున్నా చుట్టిందింట.

చిట్టన్న : ఆక్షేపించకండమ్మోయ్ - సిన్నప్పుడు గాలిపటం ఎగరేస్తూ, ఇంటిమీదనుంచి పడి తలకాయ తప్పడైందండి—

శాం : అయ్యో పాపం, శ్రద్ధగా చదువుకొనేవాడే,

వాణి : అదికాదే అమ్మా, ఫేలవకుండా, పరిక్ష ఎగేశాట్ట.

# ఆ త్మ వం చ న

శాం : ఏంచదువులో బాబూ,—వాళ్ళ నాన్న వాడిమీద ఎంతో ఆశలు పెట్టుగున్నాడు. బ్యాంకువ్యవహారంలో దెబ్బతిన్నాడా - చితికి పోయ్యాడు పాపం—వీడేనా కుదురుగా చదువుకోకూడదు—?

వాణి : వొక పాట్టు ప్యాసయ్యాడుటే - పూర్తిగా గుండుసున్నా చుట్టలేదుటే.

చిట్టన్న : చూశారా మరి, నా తలకాయ అంతపొత్తుగా సున్నాలా లేదులెండి మరి.

వాణి : పో, వెళ్ళిపో - పనిచూసుకో.

చిట్టన్న : సిత్తం (లోపలికి పరిగెడుతాడు)

వాణి : అమ్మా, చిన్నప్పుడు మొప్పునని నన్ను తెగగోలచేసేవాడు,- రానీ, ఏడిపించి వొదిలిపెడతాను,

[కౌముదీ రాణీ లలల్లాలా లల్లా అని ఇంగ్లీషు ట్యూను పాడుతూ హుషార్ గా ప్రవేశిస్తుంది. వయస్సు పందొమ్మిది. కొంచెం ఎత్తరి. చామన చాయ. మొహం దిగులుగా వున్నట్టు కనిపించినా కంఠంలో ఆ అసంతృప్తి కనపడదు. ఒక్క చూపుతో వాతావరణాన్నంతా గ్రహించుకునే తీవ్రత కనిపిస్తుంది. వేషధారణ 'అప్టుడేట్' గా వుంటుంది. జడని వొదులుగా జారి మెడంతా కప్పేట్టుగా ముడేసింది. సిల్కుజేబురుమాలు జడచుట్టూ త్రిప్పి పళ్ళల్లో బిగిస్తుంది.]

రాణి : అమ్మా, వాణీ యేదీ?…వాణీ, అమ్మేది?

శాం : ఏవిటేవిటి - పరీక్ష ప్యాసైందా?

రాణి : లేదు. పరీక్ష ఫేలయింది - అందుకనే చాలా సంతోషంగా వుంది. ఎక్కడ ప్యాసవుతుందోనని బెంగెట్టుకున్నాను, పరీక్ష ఫేలయింది,

శాం : అదేమిటే? పరీక్ష పోయిందని సంతోషిస్తారా ఎవరన్నా? నీదంతా చిత్రం!

రాణి : హాయిగా మళ్ళా అవే పుస్తకాలు చదువుకోవొచ్చు. బెనారెస్ వెళ్ళొచ్చు. అమ్మా, యీసారి బెనారెస్‌నుంచి డార్జిలింగ్ వెళ్ళొస్తానే. ఎంచక్కా నేనూ, వాణీ వొకేసారి ప్యాసవుతాం.

వాణి : నేనుకూడా యీ సంవత్సరం ప్యాసైతేగదా ?

రాణి : ఓస్, క్లాస్‌పరిక్ష, కావాలన్నా ఫేల్‌కాలేవ్. అమ్మా, బెనారెస్ మెట్రిక్ ఎంత కష్టం అనుకున్నావ్ ! యిక్కడ బి. ఏ. తో సమానం అమ్మా. పరిక్షపోయినందుకు వో చిన్న టీపార్టీ యిద్దామా ?

శాం : ఇప్పుడు నువ్వు ప్యాస్‌కాలేకపోతే పోయింది లేదుకాని నలుగురుతోనూ మిడిసిపడుతో చెప్పావంటే, ఎవరేనా నవ్వుతారు. వాణీ పుట్టినరోజుకి పార్టీ యిద్దువుగాని లే,

వాణి : నాపుట్టినరోజు కివ్వడం దేనికీ— తనకి పుట్టిన రోజు లేదా - పోనీ, వారాలబ్బాయి, కాదు క్షమించండి - శేఖరం పరిక్ష తెలుస్తుందిగా - దాని కివ్వొచ్చు.

[redacted] : నేనేం గుంజుకోడం లేదు, నీకు పందొమ్మి దేళ్ళొచ్చా యని వదిమందికీ తెలవడం యిష్టంలేక. నాపుట్టిన రోజుకి పార్టీ యిస్తావంటే, అన్నాను.—

రాణి : నీకు రాలేదూ పద్ధెనిమిదేళ్లు ?

వాణి : లేదు, నాకుపదహారే-నాకు పద్ధెనిమిదైతే నీకు ఇరవై రెండు.

శాం: ఇస్, వూరుకోండే అమ్మా, - ఎన్నో అన్నీ, ఏళ్ళకేం భాగ్యం, అవే వొస్తాయి,

(గదిలోపల చిట్టన్న గొట్టాన్ని సుత్తితో కొడుతుంటాడు.)

రాణి : చూడు లేకపోతేనూ ! ఒరే చిట్టన్నా, ఆ గొట్టంతో ఏం చేస్తున్నావురా—

చిట్టన్న : నే నేమి చెయ్యడం లేదండోయ్— రాణమ్మగారు కింద పడేస్తే, సొట్ట పడిందండి— సొట్ట తీస్తున్నాను.

వాణి: నేను కిందపడేశానని ఎవరు చెప్పార్రా—నే నాగదిలోకే వెళ్ళ్ఁదే.

చిట్టన్న: లేకపోతే, దానికే యేదో జబ్బొచ్చి, సొట్టపడింది కామాలు నండి—

రాణి: (లోపలి కెళ్ళి) ఆహా - ఎంత అందంగావుందీ గొట్టం? దీన్ని తీసికెళ్ళి, రోడ్డుమీద గిరవాటెట్టిరా—

శాం: పోనీలేవే - బాగుచేస్తున్నాడుగా - ఏదో పాతది, పదహారేళ్ళనాటిక్రితం మీ నాన్న కలకత్తానుంచి తీసుకొచ్చారు.

వాణి: పాతపడ్డామని, అమ్మా, అక్కయ్యా, నిన్నూ, నన్ను కూడా రోడ్డుమీద తూములో పడెయ్యగల్దు.

రాణి: చాలా తెలివిగా మాట్లాడా ననుకుంటున్నావా?

వాణి: నీతో నే నేం మాట్లాడలేదు.

[గ్రామఫోన్‌కీ యివ్వడం—పెట్టడం, ప్లేటుమీద పిన్ను కొంతదూరం వెళ్ళి గీతలో పడి తన్నుకుంటుంది.]

శాం: ఊరుకేవే, దాంతోకూడా నువ్వానూ.

వాణి: చూడు మరి - (మెల్లిగా) దానికి వినబడకుండా మెల్లిగానే అన్నాలే,

రాణి: (దూరాన్నుంచి) ఈ గ్రామఫోన్ మొగదు చెమిటాళ్ళ పాఠశాలకి బహుమానంగా యిద్దాం దీన్ని.

వాణి: నువ్వు యజమానురాలివి—కావాలంటే, కొత్తరకం గ్రామఫోన్ కొనుక్కో, దాన్ని నేను తీసుకుంటాలే.

చిట్టన్న: మీకూ మీకూ అక్కర్లేకపోతే నా కిప్పించండి,

రాణి: తీసుకెళ్ళి యీ గొట్టంలో నీ తలకాయ దోపుకో. (గిరవాటెడుతుంది)

# ఆత్మవంచన

చిట్టన్న : రాణమ్మగారూ, గొట్టం అంటే జ్ఞాపకం వొచ్చింది, సూర్నారాయణగారింట్లో గ్రామఫోనుకి గొట్టం లేదండీ - భలేగా వుంటుంది. మీరు చూశారంటే, తప్పకుండా కొనేద్దురు.

రాణి : సూర్యంగారింట్లోదేనా - నాకు తెలీదేమిటి ? అదేం కొత్తది కాదు, పాతదే—

చిట్టన్న—కొత్తదండీ - పాతది నేను చూశానండి - సాయంత్రం వొస్తారుగా అడిగిచూడండి.

శాం : ఊరెళ్ళాడుట—వచ్చాడన్నమాట.

చిట్టన్న : వచ్చారండి,

వాణి : ఎవరది ? చూడు చిట్టన్నా.

[రాజశేఖరం ప్రవేశిస్తాడు. చేతిలో చిన్న పంచీ వుంటుంది. దాన్ని బల్లమీద పెడతాడు. జేబులో తడిమి చిల్లరతీసి చిట్టన్న కిస్తాడు. వయస్సు ఇరవై మూడు: కొంచెం పొడుగ్గా ఎదిగిన వుంగరాల జుట్టు. సుడివుండడం మూలాన్ని పక్కపాపడి కనపడదు. విశాలమైన నుదురు, పొడుగాటి ముక్కు. శాంతిన్యాన్ని సూచించే పల్చటి పెదవులు. అందంగా వొంకర దిరిగి పట్టుదల్ని సూచించే గడ్డం. కళ్ళల్లో కారుణ్యం కనిపిస్తుంది. అది నీరసంవల్లో, అమాయి కత్వంవల్లో తెలియదు. ముతకరకం ఖద్దరులాల్చీ, ముడతలు రేగిన పైజమా. మామూలు ఆకుజోళ్ళు.]

రాజ ; నేనేనండి, శేఖరాన్ని - చిట్టన్నా, బెడ్డింగ్ ఆమూ లెట్టు. అక్కడ కాదు - ఆ మూలగదిలో.

శాం : వొచ్చావా రాజశేఖరం. అమ్మాయి లొచ్చారు నిన్న, రాణీ పరీక్ష పోయిందిట. ఏం, అల్లా దిగులుగా వున్నావేం ? పరీక్షలు తెలిశాయా ?

రాజ : తెలిశాయండి.

వాణి : పోయిందా ?

రాజ: లేదండి—ప్యాసయ్యాను. (నిదానించి) ఫస్టుక్లాసొచ్చింది.

శాం: అమ్మయ్య! పోనీలే పాపం. ఏదో కష్టపడి చదువుకున్నందుకు ఫలితం దక్కించుకున్నావ్.

రాజ: అంతా మీ ఆశీర్వాదం.

శాం: మేం చేసిం దేముంది? పూటకింత అన్నం పెట్టాం. భగవంతుడి దయ.

చిటన్న: మీ రొస్తేకాని, కారుకై సెస్సు యివ్వరంటండి—

రాజ: పద, వెళ్ళి తీసుకొద్దాం.

శాం: సాయంత్రం వెళ్ళొచ్చులే. భోజనంచేసి పడుకో. ఎక్కడెక్కడికి తిరిగావో యీ నాలుగురోజులూను.

రాజ: భోజనానికి మించిపోయిం దేముందండీ - ఇప్పుడే వెళ్ళి తీసుకొస్తా - రా, చిట్టన్నా.

చిట్టన్న: మీ రొస్తారటండీ రాణమ్మగారూ?

[ఇంతవరకూ రాణీ పుస్తకంవెనుక తన ముఖాన్ని దాచుకుని అప్పుడప్పుడు రాజశేఖరంకేసి తీవ్రంగా చూస్తూవుంటుంది. ఇప్పుడా పుస్తకాన్ని పక్కకి తీసేస్తుంది.]

రాణి: (చిట్టన్నకేసి చూస్తూ) నేను రాను.

వాణి: అంటే - అక్కయ్య పరీక్ష పోయిందని దిగులు అభినయం నేర్చుకుంటోంది కాబోలు.

రాజ: పరీక్ష పోతే ఏంలెండి—మళ్ళీ చదువుకోవచ్చు.

వాణి: పునాది గట్టిపడుతుందంటావ్ - అవునులే, 'నువ్వెప్పుడూ ఫేలవలేదుకదా - నీపునాది పోయేదన్నమాట.

(రాణీ నవ్వేస్తుంది)

శాం: నవ్వుతారేమిటర్రా—వాణీ, నువ్వతనికి కొంచెం కాఫీ తీసుకురా.

# ఆత్మవంచన

వాణి: ఏమయ్యా - తీసుకు రానా? ఫ్లాస్కులోది తాగుతావో తాగవో—

రాజ: అబ్బే! వద్దండీ ఇల్లావొచ్చి భోంచేస్తానండి.

వాణి: అల్లాగంటుంటే! (అని నవ్వుతుంది)

శాం: నవ్వుతావేమిటె వాణీ!

వాణి: నన్ను 'అండీ' అంటే నవ్వొస్తోందే అమ్మా. (వాణి లోపలికి వెళ్తుంది)

శాం: అవునోయ్ శేఖరం - చిన్నప్పుడు ఎంతో ఇదిగా కలిసి ఆడుకునేవాళ్లు, నీకంటె చిన్నవాళ్లు - వాళ్ళని 'అండీ' అనడం దేనికి?

రాజ: చిన్నప్పుడెల్లా వున్నా పెద్దయినతర్వాత మరోలా పిలవడానికి మనస్కరించదండి.

శాం: ఆ అమ్మాయిలింకా చిన్నపిల్లలే.

వాణి: మాఅమ్మ ఇంకా ఉయ్యాలను పెట్టించి జోలపాటలు పాడిస్తోంది మాకోసం. ఇదిగో కాఫీ తీసుకోవయ్యా.

(వాణీ చిరాకుగా లేచి లోపలికి వెళ్ళిపోతుంది)

శాం: చాల్లే నువ్వూ, నీవేళాకోళమూనూ, అవునర్రా మీ కేం తెలుసు?

రాజ: (కాఫీ త్రాగి) అంటే అమ్మాయిగార్లు పెద్దవాళ్ళయ్యారని కాదండి—నేనే పెద్దవాణ్ణయ్యానేమో. ఇంత మంచి కాఫీ త్రాగి అప్పుడే ఆర్రోజులు కావొస్తోంది.

వాణి: మేమంతా ఇల్లావుండిపోతాం,—నువ్వొక్కడివే ఎదిగిపోతావ్ మహా.

రాజ: అది కాదండి—పెద్ద, చిన్న అనేదండి—

వాణి: (మధ్యలో అందుకుని) చాల్లే వూరుకో.

శాం: ఆదేమిటే!

వాణి : ఆ 'అండీ' వొద్దన్నా.

రాజ : పోనీ ఇంక 'అండీ' అనన్లెండి. రా, చిట్టన్నా.

[ఇద్దరూ వెళ్తారు. రాణీ జట్టూ, బాగా మువ్వుకుని మొహం పోకుచేసుకు వొస్తుంది]

శాం : ఏమే రాణీ! శేఖరంతో ఒక్కమాటేనా మాట్లాడావ్ కాదు. ఏ మనుకుంటాడు ?

రాణి : రాజాగారు ఫస్ట్‌క్లాస్‌లో పాస్‌అయ్యారని మేమంతా చుట్టూ డాన్స్ చెయ్యాలా ?

శాం : అవేం మాటలే మరీను! పలకరించడం తప్పా ఏమిటి ? పన్నెండెళ్లు వచ్చేదాకా ఎంతో ఇదిగా ఆడుకుంటిరి—ఇప్పుడు ఒక్కమాటేనా ఆడకుండా మొహంమీద కొట్టినట్లు లోపలికి దయచేస్తివి—ఏమనుకుంటా డతను ?

వాణి : అమ్మోయ్! అక్కయ్య భరతనాట్యం నేర్చుకుంటుందిట.

రాణి : నాకు నీలాగ, ఏ మనిషిదగ్గర ఆ మనిషిమాట అనడం చేతకాదు

వాణి : ఏ మనిషిదగ్గర ఆ మనిషిమాట కాకపోతే, వొకమనిషి దగ్గర మరోమనిషిమాట అంటారా ?

శాం : నువ్వూరుకో వాణీ - డాన్సు చెయ్యమన్నానుటే - పలకరించడం తప్పా ?

రాణి : కష్టపడి చదువు చెప్పించావు పాపం, ఆ మాత్రం గౌరవం చూపించొద్దూ—

శాం : అవే మ్మాటలే—నేను చెప్పించిందేమిటి ? అంతా మీ నాన్నయిష్టం ప్రకారం చేశాను. ఇదంతా నీదికాక, నాదా ? నువ్వూ పెద్దదాన వయ్యావు.—నీయిష్టం ఏం చేసుగున్నా సరే. అక్కడికీ నీకు చెప్పకుండా, నే నేపనీ చెయ్యడమే లేదు.

వాణి : అమ్మోయ్,ఇందాక, మేం చిన్నవాళ్ళ మన్నావ్, ఇంత ట్లోనే పెద్దవాళ్ళ మయ్యామా ?

శాం : శేఖరం అన్నట్లు వయసునుబట్టి పెద్దతనం వొస్తుందా ? తనే చెప్పించమంది చదువు - మనియార్డర్లు తనే కట్టేది - పైగా నామీద పడుతోంది. చూశావా వాణీ-

వాణి : చూశావా కాదు - విన్నావా అనాలి.

రాణి : ఇప్పుడు విన్నేమన్నానే-అతన్ని పలకరించలేదని నన్నే రాపా దేస్తున్నావ్-

శాం : ఆ, ఆ - నేను రాపాడుతున్నానా ? కుశలప్రశ్న అడక్కపోతే అత నేమకుంటాడు ?

రాణి : ఏమనుకుంటాడు ?

వాణి : వాళ్ళ పరీక్షలు పోయి, నే ప్యాసైనందుకు వీళ్ళకి నే నంటే యీర్ష్య అనుకుంటాడు.

శాం : బాగా చెప్పావ్-

రాణి : తల్లీ, కూతురూ బృందగానం బాగానే చేస్తున్నారు.

వాణి : ప్రస్తుతం యిది యుగళగీతమే.-నువ్వూ చేరితే బృంద గానం అవుతుంది.

రాణి : తెలివిగా మాట్లాడా ననుకుంటున్నావా ?

వాణి : నిజంగా మాట్లాడినప్పుడు, అనుకోడం కర్మమే !

శాం : అబ్బ, ! పూరుకోండర్రా - ఉన్న యిద్దరూ యిల్లా కీచు లాడుకుంటో కుర్చోకండి-నెమ్మది నేర్చుకోండి, ఫలానా కలెక్టర్ గారమ్మాయిలు అదుపాజ్ఞలు లేకుండా పెరిగారని నలుగురూ అనుకోనా ?

- రాణి : మా కీర్తిని నిలబెట్టేటందుకు, ఫస్టుక్లాసులో ప్యాసైన రాజశేఖరం వున్నాడులే - బెంగొద్దు.

శాం : నేను వాదించలేనర్రా - వెళ్ళి వంటపని చూసుకుంటా.

రాణి: ఈ గ్రామఫోన్ పిన్నులడబ్బా దోవలో ఎవరెట్టారు?

వాణి: ఆ పిన్నులేం చేశావే నిన్న-పాపం అని మోగనేనా మోగవు.

రాణి: ఆ చిట్టన్నగాడిపనే, దానీ చెబుతాను-

వాణి: వాడు కాదే.

రాణి: ఎవరు మరి?

వాణి: చెప్పాలా?

రాణి: నువ్వా?

వాణి: శేఖరం, (నవ్వు ఆపుగుంటుంది)

రాణి: ఏం, మరీ వేళాకోళంగా వుంది నీకు? ఎందుకూ యింట్లో యీ పిన్నులు (పిన్నులడబ్బా తీస్తుంది)

వాణి: ఉండు తలుపు తీస్తా. గిరవాటెడుదువుగాని.

(తలుపు తీస్తుంది. రాణీ డబ్బా గిరవాటెడుతుంది)

[ప్రవేశం గోపాలం_వయస్సు ఇరవైయ్యొకటి. ట్వీడ్ సూట్, నలరిమ్ముల కళ్ళజోడు. వెనక్కి ఎగదువ్విన జుట్టు. 'ఫ్రెంచికట్' మీసం. ఆ పిన్నులడబ్బాని గుప్పిట్లో పట్టుగుని]

గోపా: వండ్రఫుల్ కాచ్! ఏ స్త్రీకీ బాగా గురిచూసి కొట్టడం నేర్పుగుంటేకాని పెండ్లి చేసుకునే అర్హత వుండకూడదు. ఆగండి_ఒక మూమెంట్. బండివాణ్ణి డిస్పోజాఫ్ చేసివస్తా.

రాణి: ఎవరదీ,_గోపాలమా! నీ నెత్తికి తగిలేటట్లే విసిరాను.

వాణి: గోపాలం బావా, రేపొస్తానని వుత్తరం వ్రాసి యివాళే వచ్చావేం?

గోపా: స్త్రీలు క్షణ్ముండికూడా చూశ్చేను_అన్నాడు అల్లసాని పెద్దనామాత్యుడు, ఆ వుత్తరం వ్రాసి నాలుగురోజులైంది. పోస్టుచేసి రెండు రోజులైంది, నా రాక ఒకరోజు ఆలస్యం.

# ఆత్మవంచన

శాం : ఏం గోపాలం, నువొక్కడవే వొచ్చావేం ?

గోపు : భార్యాసమేతంగా పంపించే భారం నీపైన వుండగా, అత్తయ్యా, యీ యేకాకి యెట్టి సమాధాన మివ్వగలడు ?

వాణి : ఎల్లాగేనా, పరిక్ష ఫేలయినవాళ్ళకి తెలివి తేటలు జాస్తీ.

గోపు : అని తిక్కన్న అన్నాడా ! నేను పరిక్ష ఫేలవలేదు— అసలు కూర్చోందే ! కిప్లింగ్ అన్నట్లు...

వాణి : మరి వుత్తరంలో వ్రాశావుగా !

గోపు : ఆఫ్‌కోర్స్ - దాచి లాభంలేదు. అత్తయ్యా, ఫేలయ్యా నమ్మా నెపోలియన్లాగ పరిక్ష ఫేలవనివాడూ, కాసేపేనా పిచ్చెత్తని వాడూ జీవితాన్ని అనుభవించలే రన్నాడు స్టీవెన్సన్.

శాం : పోనీ వచ్చేసంవత్సరం కూర్చుందుగానిలే—నువ్వూ, వాణీ వొకేసారి ప్యాసవ్వచ్చు.

వాణి : అక్కయ్యా, నువ్వూ వొకేసారి ప్యాసవుదురుగాని,

గోపు : అవుతే మనం వొక్కళ్ళమే కామన్నమాట. —ప్రపంచంలో మనం ఎంతో స్నేహపాంటిగా వుండలేం— అన్నాడు అరిస్టోఫేన్స్. పైగా, పురుషులతో సమానత్వంకోసం అలజడి జరిగే యీ నవీన యుగంలో మొగాణ్ణి నేనొక్కణ్ణే ముందు ప్యాసైపోవడం ఏం బాగుంటుంది— ముందువెనుకలు మిధ్యరా మందుడా అన్నారు తెరగురువులు —కొండొకచో ఫేలింప్యక్తుడు.

వాణి : ఐనా నువ్వు ప్యాసై చేసే దేముందిలే—

గోపు : ఎంతమాట ! దేవుడి దయవల్ల మీరూ ఫేలయ్యారు గనక—

వాణి : 'మీరూ' అనకు—నే నవలేదు.

గోపు : ఎమెండ్‌మెంటు విల్ బి కారీడ్ ఎట్ ఎ ఫ్యూచర్ డేట్ ! —దేవుడి దయవల్ల మీరూ ఫేలయ్యారుగనక నాకీ యింట్లో స్వాగతం యిచ్చారు కాని, నే ప్యాసై మీరు ఫేలైతే అహ్వానిద్దురా నన్ను ?

## ఆత్మవంచన

వాణి : అల్లాగంటావేమిటి బావా-ఫస్టుక్లాస్‌లో ప్యాసైన శేఖరం మా యింట్లోనే వుంటున్నాడు.

గోపు : అతనికి మరో క్వాలిఫికేషనుంది—అతను బీదవాడు. బోలెడు పర్సనాలిటీ వాల్యూ వుంది. మనం ధనికులం—అదీ మనం చేసిన పాపం—డబ్బున్నవాళ్ళు లేనివాళ్ళని ఆదరిస్తే, పాట్రనేజ్ అనబడుతుంది. డబ్బున్నవాడు వున్నవాణ్ణి ఆదరిస్తే—ఏదో మాంచి మాట వుండాలి—ఆ, వొచ్చింది 'కాండిసెన్షన్' అనిపించుకుంటుంది—అన్నాడెక్కడో వాల్టర్ స్కాట్.

వాణి : ఎక్కడన్నాడో తెలిస్తే బావ పరీక్షకే వెళ్ళను.

రాణి : అది కాదు కారణం: ఇంగ్లీషుమాట్లకి తెనుగురాదు: తెనుగుమాట్లకి ఇంగ్లీషు రాదు—అని గోపూ అన్నాడనుకోండి.

శాం : బాబూ, యీ పరీక్షలగొడవ కాసేపు కట్టి పెడుదురూ - వినలేక తల బ్రద్దలవుతోంది.

గోపు : అత్తయ్యా - బ్రద్దలవుతున్నది - మనలో మనమాట - చెవులా, తలా ?

శాం : అన్నాలకి లేవండి.

రాణి : అప్పుడే అన్నాలకే—రాజశేఖరం రాలేదుగా.

వాణి : నా కడుపులో మాడుతోంది,—మాకు ముందు పెట్టు—తరువాత తింటాడులే—

రాణి : మనం ముందుతిన్నామంటే, —అందులో ఫేలైనవాళ్ళం, —యింకేమన్నా వుందీ :

వాణి : అస్తమానూ, ఫేలైనవాళ్ళల్లో నన్నుకూడా జతపర్చకండి.

శాం : ఏం చిత్రమే,—మరీను—లేవండి—

(రాజశేఖరం వస్తాడు)

## ఆత్మవంచన

గోపు : వెయ్యేళ్లాయుష్షు నీకు—మాకు అన్నదానం చేశావయ్యా రాజశేఖరపండితా!

శేఖ : గోపాలంగారా—ఎప్పు డొచ్చారు?

గోపు : కంగ్రాట్యులేషన్సు—మళ్లా మర్చిపోతా లేకపోతే—ఫస్టు క్లాస్‌లో ప్యాసయ్యా వన్నమాటేగాని, అర్ధంలేని ప్రశ్నలు అడగడం మానలేదేమయ్యా నువ్వు?—ఇప్పుడే వొచ్చాను.

శేఖ : ఇంటిదగ్గరంతా కులాసా?

గోపు : మరో అర్ధంలేని ప్రశ్న. ఆ, అంటటూ కులాసాయే.

వాణి : లైసెన్స్ యిచ్చారా?

శేఖ : ఇచ్చారండి.

గోపు : నే నీమధ్య డ్రైవింగ్ నేర్చుకున్నాను—హెచ్. జి. వెల్స్ అన్నట్లు...

రాణి : నిన్ను ఫేల్ చేసిన మేష్టర్ల నెక్కించుగుని డ్రైవింగు చేద్దువుగాని లే.

గోపు : ఎక్స్‌క్యూజ్ మి, మేడమ్ క్యూరీ అన్నట్లు, మేష్టర్లు గాదు, ప్రొఫెసర్లు. మళ్ళా పెట్రోల్ కర్చులేకుండా, నీ పేపర్లుదిద్దిన మేష్టరమ్మల్నిగూడా యీ ట్రిప్పులోనే లాక్కుపోతాలే.

వాణి : బావోయ్! నేనూ, శేఖరం ప్యాసైనవాళ్ళం—ఫస్టుట్రిప్పు మాది, ఏం శేఖరం?

శేఖ : మీరందరూ వెడుదురుగాన్లెండి - నేనెందుకు?

శాం : అదేమిటోయ్—నువ్వూ వెళ్ళు. సాయంత్రం తీసుకుదేగా.

శేఖ : చదువుకుంటా లెండి—

గోపు : ఏమిటయ్యా, మహా—ప్యాసయ్యావనా—అతి చదువు చదువుకున్నవారు అసహాయశూరు లవుతారన్నాడు లాంగ్‌ఫెలో. డ్రైవింగొచ్చా నీకు?

# ఆ త్మ వం చ న

శేఖ: వొచ్చు—కానీ……..

గోపు: దేశ డ్రైవ్—జీవితంలో నెగ్గాలంటే డ్రైవ్ వుండా లన్నారు, అమెరికన్స్ మొత్తంగా.

వాణి: అక్కయ్య అడుగుతేగాని, శేఖరం రానను కుంటాను.

శేఖ: అప్పే, అదేం లేదండి—కులాసాగా మీ రెళ్ళిరండి—

రాణి: పోనీ నీకు డ్రైవింగ్ వొస్తే. నువ్వు డ్రైవ్ చేద్దువుగాని.

గోపు: అదేమిటి రాణీ - ఫస్ట్‌క్లాస్‌లో ప్యాసైనవాణ్ణి కారు నడప మనడం భావ్యం కాదు—'దోజ్ హూ పాస్ ఆర్ బైపాస్‌డ్' అన్నాడు చర్చిల్.

శాం: షికారుమాట తరువాత ఆలోచిద్దాం,—ముందు భోజనాలకి లేవండర్రా.

గోపు: చాలా ఉత్తమమైన ఆలోచన చేశావత్తయ్యా,

వాణి: వేమన్న అన్నట్లు—

[అందరూ లోపలికి వెళ్తారు. చిట్టన్న అవీ యివీ సర్దుతుంటాడు. గ్రామఫోన్ రికార్డు పెట్టి, దాంతో కలిసి, తనూ పాడతాడు. శేఖరం చెయ్యి తుడుచుకుంటూ వొచ్చి, వో కుర్చీలో కూర్చుని, పేపరు తిరగేసి, రెండు నిమిషాలు చదివి, మడిచేసి, తువ్వాలు పైనేసుకుని బైటికి వెళ్ళిపోతాడు. చిట్టన్న మరో రికార్డు పెట్టి సోఫా పక్కన కునికిపాట్లు పడుతుంటాడు. పిన్ను గాడిలో పడి కొట్టుకుంటుంది. ఆ ధ్వనికి లేచి లోపలికి పరిగెడతాడు. ఇంతలో, వాణి, రాణి వొస్తారు.]

వాణి: శేఖరం ఏడీ?

గోపు: శేఖరం టోకా ఇచ్చేశాడు.

శాం: అతని కేం పనులున్నాయో - మీ రెళ్ళిరండి.

రాణి: ఏం పనుంటుందీ—

వాణి: ఐనా, అతన్ని డ్రైవ్ చెయ్యమనడం ఏం బాగుంటుందీ!

రాణి: తప్పా? గోపాలం చెయ్యడం లేదూ? నే చెయ్యనూ?

గోపు: బాగా చెప్పావు, వైర నన్నట్లు...

రాణి: ఇంతట్లోకే వెర్రివరై పోయ్యాడా? మనం చదువు చెప్పించకపోతే నిక్షేపంలా ఆ పనే చేసును.

వాణి: అల్లా అనడం బాగుండలే దక్కయ్యా!

గోపు: బాగలేకేం? సత్యం వక్కాణించింది రాణీ—సత్యానికి సంఘంలో తావు లేదు. అందుకనే, రాణీ, నేనూ చదువులో వెనకపడ్డాం.

[ప్రవేశం సూర్యనారాయణ—వయస్సు సాతికపైగా వుంటుంది. వెడల్పుగా, చదరంగా వుండే మొహం. సుధ్యపాపిడి, పక్కకి దొంచి దువ్విన హాట్క్రాప్. పెద్ద గుండ్రటి పెదవులు, ఎత్తైన విగ్రహం, తెల్ల ఫాంట్, చారల స్పోర్టింగ్ కోటు, హాండ్ స్టిక్కు. ఆటవాసంగా వుంటాడుగాని, మాట మృదువుగా, వింపాదిగా వుంటుంది. నోట్లో సిగరెట్టు తీసి అగ్గిపెట్టె వెదుక్కుంటూ, బల్లపైన తడుముతాడు.]

సూర్య: మంచి టైముకే వొచ్చా నన్నమాట—హల్లో గోపు—ఎప్పుడు రావటం?

గోపు: హల్లోల్లో నారాయణ్ జీ! నా రాకపోకలు పత్రికల్లో వేయించా లనుకుంటూ, ఉదయా న్నొచ్చానండి. ఏమిటి కథా—పూనా రేసెస్ బాగా సాగుతున్నయ్యా?

రాణి: (ఆహ్లాదంతో) రండి, మీకోసమే చూస్తున్నా. మీ రేదో కొత్త గ్రామఫోన్ కొన్నారటగా. మా చిట్టన్న తెగపొగుడుతున్నాడు.

సూర్య: అబ్బే పాతదే. కొత్తగా కాబినెట్ చేయించాను. ఈ చీర చాలా బాగుంది—కొత్తగా కొన్నావా?

రాణి: బాగుంది కదూ! పూనాలో కొన్నాను.

వాణి: దాని పేరేమిటో ఎరుగుదురా? ట్విలైట్ పాటర్న్.

సూర్య: శేఖరం ఏడీ?

రాణి: అయనగారికి తీరుబడి లేదట.

సూర్య: తీరుబడి లేకేం...ప్యాసయ్యాడుగా—ఏం చేస్తాట్ట?

రాణి: ఏమో - ఎవరికి తెలుస్తుంది? ఎందుకేనా మంచి దని డ్రైవింగ్ కూడా నేర్చుగున్నాడు.

సూర్య: (బిగ్గరగా నవ్వి) అంటే, ఆతనికి కొంచెం సిగ్గు, భయం అనుకుంటాను.

రాణి: వాణీ, చిట్టన్నని వెళ్ళి డ్రైవర్ని తీసుకురమ్మను. గోపూ, నువ్వెళ్ళి చిట్టన్న నితీసుకురా—

గోపు: వాణీ, నువ్వెళ్ళు ముందు—వంటింట్లో అత్తయ్యకి సాయపడాలి నేను. అత్తయ్యా, వొస్తున్నా. (వెళతాడు)

సూర్య: ఏం రాణీ, మహాబలేశ్వరం వెళ్ళినప్పుడు, నన్ను రమ్మని వుత్తరం రాయలేదేం, నేనూ వొద్దునుగా—

రాణి: రాస్తే వొస్తారా ఏమిటి మీరు?

సూర్య: సన్నాలా అర్థంచేసుగున్నా వన్నమాట. చెబితే ఆశ్చర్య పడతావు - నువ్వు యిక్కడ లేని యీ మేడాదీ అజ్ఞాతవాసంలా గడిపాను. అడుగు మీ అమ్మని—రోజూ వొచ్చి, మీ యిల్లు చూసిపోతూ వుండేవాడిని.

రాణి: దోవలో వుంది కాబట్టి.

సూర్య: రాణీ, యిల్లా చూడు. నన్ను నువ్వు ఎందుకు నమ్మలేవు?

రాణి: దగ్గరున్న కాసేపూ అల్లా గంటావుకాని— నీకేం— హాయిగా బోంబే రేసెస్ కెడతావ్,—సమ్మర్‌కి కాష్మీ రెడతావ్, శ్యామలతో—

సూర్య: శ్యామలా? అదా నీ అనుమానం, పాపం! శ్యామల దూరపుచుట్టం. వాళ్ళు అంత స్థితిపరులు కారులే— వెర్రి బాగుల్ది— అడిగినప్పుడల్లా కాస్త డబ్బు పారేస్తుంటాను.

రాణి: (కుర్చీ దగ్గరగా లాక్కుని) నిజంగానా? నమ్మొచ్చా నేను—?

సూర్య: చేతిలో చెయ్యి వెయ్యాలా?

రాణి: మరే—చెయ్యి పట్టుకోనివ్వను.

సూర్య: రాణీ, ఇప్పుడు నిన్ను చూస్తుంటే ఏదో స్వప్నంలో వున్నట్లుగా వుంది,

రాణి: ఓహో, నిద్రపోతున్నట్లున్నారు— పాపం, శ్యామల లేపుతుంది లెండీ—

సూర్య: రాణీ, యింత బాధపెట్టె మాటలు ఎల్లా వొచ్చాయి నీకు? ఇదుగో చూడు, కళ్లుమూసుగో—

[కోటు జేబులోంచి వో పాకెట్ తీసివిప్పుతాడు—అందులోంచి నెక్లెస్ పైకి తీస్తాడు.]

రాణి: ఏమి టిది? డైమండ్స్ నెక్లెస్! అబ్బ—బ్యూటిపుల్—

సూర్య: బోంబేలో కొన్నా నీకోసం—మెళ్ళో తగిలించనా?

రాణి: అమ్మో! ఇల్లాగేనే ముట్టుగుండా మనేం? ఇప్పుడొద్దు. నా బర్త్‌డే కిద్దురుగాన్లెండి.

సూర్య: ఏరోజు కారోజే పుట్టినట్లుగా వుంటావు. నిత్యమూ నాకు నీ బర్త్‌డేయే.

రాణి: అన్నీ దొంగమాట్లు. ఓయబ్బ— ?

[గోపు, ట్రేలో రెండు కప్పులతో టీ తీసుకొస్తాడు.]

గోపు: టీ రెడీ.... అన్నీ దొంగమాట్లు. అంతామాయ! వొక యథార్థం టీ, ఫర్ టూ అన్నారు పత్రికల సంఘంవాళ్ళు.

సూరి: థాంక్స్.

గోపు: నాటెటాల్. థాంక్ వాణి.

వాణి: కార్ సిద్ధంగా వుందిటక్కయ్యా!

రాణి: లేవండి. అల్లా షికారెళ్ళొద్దాం.

గోపు: అసలు కారు అనే పదం షికార్లోంచి వొచ్చిందని నా అనుమానం. లిబర్టీలోంచి టీ వొచ్చినట్టుగా. హరీ అప్, వాణీ.

వాణి: పాపం, చిట్టన్నో!

గోపు: నో స్పేస్...ఆనాడు కృష్ణుడు సారథి—యీనాడు గోపు డ్రైవరు. చిట్టన్నా, దూళ్ళకి చిప్పెడతావు.

[అందరూ వెడతారు. చిట్టన్న అంతా వెళ్ళాకా చూసి గ్రామఫోన్ పెడతాడు—'గైడ్ మొదటిపాట']

[ప్రవేశం రాజశేఖరం. తువ్వాలు కుర్చీమీద వుంచి సోఫాలో కూర్చుని పత్రిక చదువుకుంటాడు.]

చిట్టన్న: అందరూ కార్లో వెళ్ళారండి. మీ రెళ్ళలేదేం?

రాజ: లేదు - నువ్వెళ్ళలేదేం?

చిట్టన్న: చో పెక్కడికండి? మీకోసం సూశారండి.

రాజ: ఏం?

[హారన్ మోగుతుంది]

చిట్టన్న: వొస్తుండారండి. (ఫోన్ తీసేసి గబగబ బైటికివెడతాడు,)

(రాణి పాడుకుంటూ వొస్తుంది)

(శాంతమ్మగారు ప్రవేశిస్తుంది)

రాణి: ఎవరాగదిలో?

శాం:, రాజశేఖరం యిప్పుడేవొచ్చాడు,

వాణి: ఏమయ్యా శేఖరం, నువ్వురాలేదేం మాతో? డ్రైవింగ్ చెయ్యాల్సివొస్తుందనా?

# ఆ త్మ వం చ న

చిట్టన్న : (దూరంగా ఏవో సద్దుతూ) ఇంతమందికి చోటెక్కడి దండీ ?

రాజ : (నవ్వుతాడు)

రాణి : చిట్టన్నా యీప్లేట్లన్నీ చిందరవందరగా పారేసిందెవరు ? తరవాత సర్దుదువుగాని, నువ్వుకారుని గేరేజ్‌లోకి తీసికెళ్ళి బాగుచెయ్యి.

చిట్టన్న : అప్పుడే సెడిపోయిందాండి ?

రాణి : అదికాదురా, క్లీన్ చెయ్యి— పో.

చిట్టన్న : ఓ పోతుండా. (వెడతాడు)

వాణి : అక్కయ్యా నేనుస్నానం చేసొస్తాను.

శాం : వాళ్ళేరీ ?

వాణి : (వెడుతూ) వాళ్ళక్లబ్బులో దిగారు.

శాం : వర్షం వొస్తున్నట్లుంది — బట్టలారేశాం — చూద్దాంపద (వెడుతుంది)

రాణి - (జడవిప్పి, మళ్ళా అల్లుతూ) ఇక్కడేవున్నావా ? మాతో రాలేదేం ?

రాజ : మీరందరూ వున్నారుగా ! నాకు వేరేపనుంది.

రాణి : మాతో రావడం యిష్టంలేదా ?

రాజ : అబ్బే ! అదికాదండి —పైగా కార్లో చోటుండదేమోనని—

రాణి : పరిక్షప్యాసయ్యావుగదా - తరవాత ఏం చేద్దామనుకుంటున్నావు ?

రాజ : అదే ఆలోచిస్తున్నానండి...

రాణి : నన్ను అండీ అనడం ఎందుకు ? చిన్నప్పుడులా రాణీ అనకూడదూ ?

రాజ : ఎల్లాగో వుంటుందండి— పెద్దవాళ్ళం అయ్యాక—

# ఆ త్మ వం చ న

రాణి : నే పెద్దదాన్నా ?

రాజ : అబ్బే మీరు పెద్దనికాదు—అల్లాగంటే బాగుండదు.

రాణి : నే అనమంటున్నాను, సరేనా ?

రాజ : సరేనండి.

రాణి : అదిగో మళ్లీ !

రాజ : సరే.

రాణి : కారు బాగుందా ?

రాజ : చాలా బాగుంది.

రాణి : ఈ నెక్‌లెస్ చూశావా—ఎల్లాగుంది ?

రాజ : చాలా బాగుంది,

రాణి : ఎంతవుతుందో తెలుసా ?

రాజ : డైమండ్స్‌లాగున్నాయి.

రాణి : లాగుంటంకాదు - డైమండ్సే. ధరకట్టు.

రాజ : నేను కట్టలేను—ఐదొందలుంటాయా ?

రాణి : (నవ్వి) రెండెట్టి గుణించు, లెక్కలేగా నీ గ్రూప్ !

రాజ : అబ్బో ! బాగుంది.

రాణి : డైమండ్స్ బాగున్నాయా ? నే పెట్టుకుంటే బాగుందా ?

రాజ : (నవ్వుతాడు)

రాణి : ఏం ?

రాజ : ఏమీలేదు—నావిషయం ఆలోచిస్తున్నాను.

రాణి : ఏంచేద్దామనుంది ?

రాజ : ఆలిండియా సర్వీస్‌లో వుద్యోగానికి వోపరీక్షవుంది, దా[redacted] చదివి కడదామనుంది. అది ప్యాసవుతే మంచివుద్యోగం దొరుకుతుంది.

రాణి : ఎందులో ?

రాజ : వాళ్ళిష్టం—ఎందులోనేనా యివ్వచ్చు.

రాణి : నీ కేది కావాలనుంది ?

రాజ : నాకు రైల్వేలో పనవాలనుంది.

రాణి : నారాయణగారి మామయ్యకి అందులోనే పెద్దపని.

రాజ ; అల్లాగాండి—

రాణి : అదే వొద్దన్నది—ఆ పరిక్షకి ఏం చెయ్యాలి ?

రాజ : ఇది మే, నవంబర్లో పరిక్షవుంటుంది—వొందరూపాయలు ఫీజ్ కట్టాలి. ఢిల్లీ వెళ్ళాలి.

రాణి : నే యిస్తాను డబ్బు—కట్టు.

రాజ : కరుణాకరం నా స్నేహితుడు. అతను ఫులెన్ సూట్ యిస్తానన్నాడు. పుస్తకాలూ అవీ పోగుచేసుకుని, యిక్కడే చదువుకోవచ్చు.

రాణి : సూటు ఎవడో యిచ్చేదేమిటి ? నేనిస్తా కుట్టించుకో.

రాజ : ఇప్పుడింకా తొందర్లేదులెండి—సారీ—తొందర్లేదు.

(గోపాలం ప్రవేశిస్తాడు)

గోపు : ఓహో రాజశేఖరపండితా, యిక్కడ నక్కియున్నావా ? వాణీ, క్లబ్బులో కార్డ్సు ఆడేం—మందంతా కాజేశారు—నారాయణదగ్గర వో ఇరవై అప్పుచ్చుకున్నాను—వెళ్ళి రిటన్ చేసి రావాలి.

వాణి : ఎందుకుబావా, రేపొచ్చినప్పుడు యిద్దువుగానిలే—

గోపు : రేపు అనేది యెక్కడుంది—ఇవాళగర్భంలో రేపు దాగివుంది. రేపు నిన్నైనప్పుడు గతం యుగాంతరానకాదా, ఒమార్ అన్నట్లు—ఏం శేఖరంపండితా—

రాజ . అంతేనయ్యా.

రాణి : పోనీ, నువ్వూ, గోపూ వెళ్ళిరండి—

గోపు: ఐడియా; ఎల్లాగేనా స్త్రీలుసృష్టికర్తలు బెర్నార్డుషా అన్నట్లు-

రాజ : పదవయ్యా వెడదాం—వైట్ హెడ్ అన్నట్లు.

గోపు. వ డెవడు ?

రాజ : గణితశాస్త్రజ్ఞుడు—

గోపు : చచ్చాం, నీది లెక్కలు కాబోలు, లెక్కలకీ మనకీ శత్రుత్వం. నువ్వు మాష్టరీచెయ్యి, మార్కులేద్దువుగాని— అన్నట్లు రాణీకి లెక్కలంటేనే భయం అనుకుంటా—సారీ లెక్కలకే రాణీఅంటేభయం.

వాణి : బావ గూఢంగా మాట్లాడుతున్నాడు !

గోపు : లోతులు తవ్వడం ఆడదాని వొంతు, అందులో పడ్డం మావంతు—మేటర్లింక్ అన్నట్లు !

రాజ : ఈమధ్య గోపాలం పుస్తకాల క్యాటలాగ్ చదువుతున్న ట్లున్నాడు—రావయ్యా—

వాణి : బావా, బుక్ స్టాల్ పెట్టు,

గోపు : రైటో. కవుంటర్ దగ్గర నువ్వుకూర్చుంటే... ఇదె వచ్చు చుంటిని శేఖరా—దుష్యంతు డన్నట్లు—

(ఇద్దరూ వెళతారు)

రాణి : వాణీ, గోపూతో వేళాకోళాలేమిటే ?

వాణి : ఏం, బావేగా— వేళాకోళం ఏమాడాను ?

రాణి : అంత పూసుకుతిరిగితే లోకువ-కట్టేస్తాడు.

వాణి : పరాయివాడు కాడుగా.

రాణి : నీమనస్సులో ఏదోవున్నట్లుంది.

వాణి - వుందని నీకుతెలిస్తే, ఏం వుందోమాత్రం నీకుతెలీదా ?

రాణి : గోపాలం ఎందుకూ పనికిరానివాడవుతాడు - పైగా వాళ్ళ ఆస్తంతా పోయింది తెలుసా ?

వాణి : అమ్మ చెప్పింది, తెలుసు, ఐనా దానికీదీనికీ ఏంసంబంధం?

రాణి : ఏమో నీయిష్టం—పెద్దదాన్ని చెప్పాను.

వాణి : నువ్వు చిత్రంగా మాట్లాడుతున్నా వక్కయ్యా...గోపు రాజశేఖరం అంత చెయ్యడా ?

రాణి : అతని మాటెవరెత్తారు ?

వాణి : బీదసాదల ప్రస్తావనెందుకు మరీ ?

రాణి : గోపాలానికి మానర్స్‌లేవన్నాను, ఇందాక నేనూ, సూర్యం మాట్లాడుకుంటుంటే, మధ్యలో ఏదో అందుకున్నాడు.

వాణి : అదా కథ—ఏమో అనుకున్నామ. (నవ్వుతుంది)

రాణి : అంతనవ్వుగా వుందా ఏం ?

వాణి : మనకి మానర్స్‌వున్నాయా—

రాణి : నీతో నే వాదించను. (తల్లోపూలుతీసి బిల్లమీద గిరవాటెట్టి లోపలి కెడుతుంది.)

---

# ఆత్మవంచన

## [రెండో అంకం]

## 1

సమయం—౧౯౩౮ ఏప్రిల్—

స్థలం—కలెక్టర్‌గారి ఇదివరకటి బంగళాయే

[కుడివైపున రెండు మూడు రౌండ్ టేబిళ్ళు, ఏడెనిమిది కుర్చీలువుంటాయి. టేబిళ్ళమీద కప్పులు ప్లేట్లు అమర్చివుంటాయి. లోపల్నించి గ్రామఫోన్ సంగీతం వినిపిస్తుంటుంది. టీ పార్టీ సన్నాహం. ఎడంవైపు, మధ్యగావున్న స్క్రీన్ అవతలభాగం చిన్నగది—ముందుగా జరిగి కుర్చీమీద గోపాలం కూర్చుని వుంటాడు. వాణి ముస్తాబై (రెండుజడలు) బల్లమీద టీసామగ్రి సవరిస్తుంటుంది.]

వాణి: నీతో నే వాదించను.

గోపా: భయంలేదు. వాదంలో స్త్రీని గెల్చిన మొనగాడు యిక ముందు జన్మించాలని రామాయణం రచించిన మీ మొల్లేఅంది. ఇంతకీ యీ హడావుడంతా మీఅక్కయ్య ఎందుకుచేస్తున్నట్లు?

వాణి; శేఖరం ఆలిండియా సర్వీస్ ఎక్జామినేషన్ ప్యాసయ్యాడుగా, అందుకు.

గోపా: నిన్ను ఖండించడం యిష్టంలేదు — ఐనా, సూర్నారాయణ వూళ్లోకొచ్చినందుకు యీపార్టీ యిస్తోందంటాను,

వాణి : మొన్నంది—నువ్వింకా మీవూర్నించి రాలేదులే—శేఖరం పాసయ్యాడు. పార్టీ యివ్వాలే అంది.

గోపు : అదా కథ ? గాలి మరోదిక్కున వీస్తోందన్నమాట. గెథె అన్నట్లు నే ప్యాసైతే నువ్వూ వోపార్టీయిస్తావా నాకు ?

వాణి : గోపూ, నీకోటిచెబుతా, ఏమీ అనుకోవుకదా !

గోపు : విన్నతర్వాతగాని వాగ్దానం యివ్వలేను—విప్రనారాయణు డన్నట్లు—

వాణి : ఇస్—కాసేపు వూరుకుందూ—మాఅక్కయ్యంటే నీకు చాలా యిష్టం అనుకుంటోం దక్కయ్య.

గోపు . ఆగు, ఆగు, గుండి పట్టుగోనీ—వోవిధంగా నిజం కూడానూ.

వాణి : అదికాదు. మనం యిల్లావుండడం అక్కయ్యకి యిష్టం లేదు.

గోపు : వొచ్చిన నష్టంఏమీలేదు. మీఅమ్మ అభ్యంతరం లేదుగదా—

వాణి : మీది తక్కువ స్టేటస్ అట.

గోపు : కారల్‌మార్క్స్ అన్నది నిజమే—డబ్బునహీ—ప్రేమ నహీ—బంకిమ్‌చంద్రుడన్నట్లు అందాకా ఎందుకు ? "ధనమూల మిదం జగత్" అని మనపూర్వులు అనలా పాపం ! వాణీ—మీకంటే మాకు వో ఏభై ఎకరంతక్కువ. అంతేగా తేడా ? ఆ ఏభై నే గడించలేనా ఏమిటి ?

వాణి : నువ్వు నిన్న దాని నెక్‌లెస్ ఎంతోబాగుందని మెచ్చు కున్నావ్, దాంతో వొచ్చింది పేచీ—

గోపు : వాణీ. నన్ను నువ్వులవ్‌చేస్తేచాలు, ఆ నెక్‌లెస్‌కిబదులు యీ పుష్పాంజలి సమర్పిస్తాను—టాగూరన్నట్లు—గుబ్బపు పందాల గుండె దడబదులు యీ గడ్డిపూల నాట్యం కుదర్లేదు—యతిప్రాసగాళ్లు

వాణి : అప్పుడే నాలుగవుతోంది. యింకా అక్కయ్యరాదేం—

గోపు : షాపింగ్‌కు. సుబ్బులేకుండా వొక్కత్తీ వెళ్ళింది గనక చప్పున రావొచ్చు—బజార్లో అంగళ్ళు వేసేస్తున్నారు,

(శాంతమ్మ ప్రవేశిస్తుంది)

శాం : కుర్చీలు, బల్లలూ సర్దేరా—పెందళ్ళే చూడందర్రా, రాజశేఖరం యేడీ?

గోపు : లైబ్రరీకి వెళ్ళొస్తానన్నాడు.

శాం : బానే వుంది—యింకా మెందుకు యీ చదువు—తనకోసమేగా యివంతా చేస్తున్నదనే ధ్యాసవొద్దూ ?

గోపు : విజ్ఞానమే శక్తి అన్నాడు ప్లాటో పండితుడు.

శాం : మళ్ళీ చూడు గోపూ—

గోపు : ఇదే పోతుంటి.

(వెళ్తాడు)

[కరుణాకరం ప్రవేశిస్తాడు—ఒబ్బిడిగా పెరిగిన జుట్టు మధ్యపాపిడి, కండ్లజోడు, లాల్చీ, పైజామా, పైన కండువా, పెద్దపూలగుత్తి పట్టుకొని వొస్తాడు.]

వాణి : ఓహో ? కరుణాకరమా—కమిన్, కమిన్.

కరు : రాణీ ఏదీ, ఇంకా ఎవరూ వొచ్చినట్లులేదే ?

శాం : బాగున్నారాఅండి ? ఏదన్నా వుద్యోగం చేస్తున్నారా ?

కరు : లేదండి.

వాణి : ఆయనకి వుద్యోగంఎందుకు జమీందారుబిడ్డ.

శాం : ఐతే మట్టుకు ... ఉద్యోగం పురుషలక్షణం.

(గోపూ ప్రవేశించి)

గోపు : పోతన అన్నట్లు—అనాలమ్మా అత్తయ్యా. లేకపోతే ఆ నిర్వచనానికి ఏమీ విలువవుండదు. ఈ రోజుల్లో ఎడ్యుకేషనంటే, ఎవ

దేమన్నాడో తెలుసుకోడం—సదిపేర్లు చెప్పగానే అంతలవ్యక్తి హడలి పోతాడు—వీడికి సొంతంగా ఏమీరాదురా అనుకుని ఉద్యోగం ఇవ్వడు, అన్నీ మనసొంతంగానే అన్నాగా, వాబోయ్, వీడు మనకంటె తెలివైన వాడురా అని హడలిపోయి, ఉద్యోగం యివ్వడు. "ఎస్ యిజ్ బ్రీఫ్ యాజ్—ది కాజ్ ఆఫ్ ది ప్రెజెంట్ అనెంప్లాయ్‌మెంట్"

శాం : ఏమో బాబూ, నాకివన్నీ తెలియవు మొగపిల్లలులేరు— ఉద్యోగాలబెంగ నాకులేదు.

గోపు : అత్తయ్యకి అల్లుడిగొడవలేదు, గార్కి-అన్నట్లు.

శాం : (నవ్వి) సరేలే—వాళ్ళందర్నీ చూడండి—నాకు పనుంది—వారు కరుణాకరంగారని, శేఖరంతో చదువుకున్నారు. (వెళుతుంది)

వాణి : ఏమండీ కరుణాకరం—ఈమధ్య కనపడ్డం మానేశారు?

కరు : అదేమిటి మొన్ననేగా, నేనూ రాణీ క్లైరెన్నాడతా ?

గోపు : అదుగో రాణీ వొస్తోంది,

(రాణీ వస్తుంది)

రాణి : హల్లో కరుణాకరం-పాపం ! ఎల్లాగో వొచ్చారు. థాంక్స్ లేటైంది. క్షమించాలి ఐస్ క్రీమ్‌కి ఆర్డరిచ్చాను.

కరు : చేతులో ఆపాకెట్ ఏమిటి ?

రాణి : ఏముంటై, సారీస్-వాణీ, ఆవాల్కని తుడిపించి, కుర్చీలు వేయించు. చిట్టన్నొచ్చాడా ? గోపూ, అల్లావెళ్ళి కాసిని తమలపాకుల కిళ్ళీలు కట్టించి తీసుకురా-మరిచిపోయ్యాను—బాబు, బాబు !

గోపు : నన్ను బ్రతిమలాడాలా ? ఇదె పోవుచుంటి-హా దైవమా!

(వెళతాడు)

రాణి : చూడండి.

(పాకెట్ యిస్తుంది. కరుణాకరం విప్పి, చీరని పరిశీలిస్తూ)

# ఆత్మవంచన

కరు : మాక్స్వెలిన్—పంజాబీ స్టైల్—ఇప్పుడు బొంబేలో అందరూ యిదే—నీకు చాలాబాగుంటుంది—ఇవిగో ఫ్లవర్స్ మాగార్డెన్‌లోవి.

రాణి : (వాసనచూస్తూ) ఆహా! గ్రాండ్‌గా వున్నాయి.

కరు : తల్లో వుంచనా ?

రాణి : అమ్మో—నయం! నాకుచేతులున్నాయి.

కరు : పోనీ—(మూతివిగిస్తాడు)

రాణి . కోపమొచ్చిందా ?

కరు : లేదు, లేదు.

రాణి : (తల్లోపెట్టుగొని) చూడండి యిప్పుడెల్లావుంది ?

కరు : తల్లోపెట్టుకున్న తర్వాతగాని, వాటి అందం బైటపడదు. పైజామావేసి, రెండు జెళ్ళేసి, డార్క్‌గ్లాసెస్ పెట్టుకొని బైనాకులర్స్‌తో రేసెస్ చూస్తోంటే ఫొటో తియ్యాలనుంది నాకు.

రాణి : ఫొటోకి రేసెస్‌కే వెళ్ళక్కర్లేదు, కెమిరామాన్ యిక్కడా వున్నాడు.

కరు : అవశ్యం తీయించి నాకోటివ్వాలి.

రాణి : నేనొక్కదాన్నే ?

కరు : నాకాభాగ్యం కూడానా ?

రాణి : మీకెల్లా తెలుసు ?

కరు : భాగ్యం లేకనే కవిత్వంలో పడ్డాను.

(సూర్యనారాయణ ప్రవేశిస్తాడు)

రాణి : హల్లో నారాయణగారా—రండి, రండి—కరుణాకరం కవిత్వంలో పడ్డాట !

సూర్య : మొన్న ఆదేదో పత్రికలో కొన్నిపద్యాలు చూశాను. నాకర్థంకాలేదు.

## ఆ త్మ వ ం చ న

కరు: జీవితంలో పొందలేని అనుభవాలని, వ్రాత పూర్వకంగా జీవిస్తాంగనక నేనురాసేది, కసిత్వం అనొచ్చు.

గోపు: బాబోయ్। మనమూ అదేపడవలో ప్రయాణం చేస్తున్నాం గనుక, ఏదీ కాస్త కసిత్వం వినిపించండి.

రాణి: కిళ్ళీ లేవీ?

గోపు: అత్తయ్య మధ్యాహ్నమే తెప్పించిందట ... ఏవండి, పొయిట్రీ అంటే పీక కోసుకుంటా నేను,

కరు: స్త్రీల ముందు సిగ్గేస్తోంది నాకు.

గోపు: అసలు వ్రాసేది వాళ్ళకోసమేగా?

రాణి: పోనీ నే లోపలి కెళతాలెండి.

కరు: (గొంతుసవరించి)

"స్విచ్ నొక్కు—సెకండ్ షోకి పోదాం—
టాక్సీలో సన్నటినడుం క్లోజప్.
క్లియోపాత్రా లిప్ స్టిక్,
జబ్బు. ఓవల్టీన్. నైట్ కాప్, బిగుసైంది హై పప్పు,
సౌందర్యం అంతా ఏక్ కిస్ లో హుషప్,
ఫ్యాక్టరీపొగ,
కోల్ టార్ స్మెల్,
క్లోరోఫారమ్ సెంట్
విటమిన్ లేని పల్చటి పెదవీ—
బెరి బెరి బ్యూటీ మిగిలింది,
అందం అరణాల కమ్ముతున్నారు
హాలీవుడ్ లో—
మాటనీకి సగంరేట్లు,

మా గాంధీగా రన్నారంటే
పొలిటికల్ స్టంట్ పోస్ పొమ్మన్నారు.

గోపు : (చప్పట్లుకొడతాడు)

సూర్య : పల్లెటూళ్ళు వొదిలేసి బస్తీల కెగడ్డంవల్ల నాగరికత యిల్లాతగులడిందని నాభావం, అడుగో రెడ్డి — జస్ట్ఇన్టైమ్.

రాణి : రెడ్డిగారూ, రండి, రండి.

సూర్య : రెడ్డీ నేటి నాగరికతలో లోపమేమిటో నువ్వు చెప్ప గలవా? రేపు ప్రొఫెసర్వి కాబోతున్నావు.

గోపు : పోనీ నన్ను చెప్పమంటారా?

రాణి : నిన్నెవరూ అడగలేదులే, అబ్బా — ఐదు గంటలైంది, శేఖరం యింకారాలేదేమో — వెళ్లి చూసిరా గోపు

గోపు : (వెడుదూ) ఇవాళ ఎవరి మొహంచూశానో, నా వాక్యాలు పూర్తయ్యే ప్రాప్తంలేదు,

రాణి : చెప్పండి రెడ్డిగారూ.

రెడ్డి : చెబుతాను, మన సంఘం వొక త్రికోణం : మాస్టరూ, ప్లీడరూ, డాక్టరూ దాని మూడు భుజాలును.

సూర్య : ఇంటరెస్టింగ్! వెరి ఇంట్రెస్టింగ్!

రెడ్డి : మాస్టరు పిల్లలికి స్వార్థపరత్వం, వ్యక్తిత్వం వగైరా నేర్పిస్తాడు. ఎవడికి వాడే స్వతంత్రంగా బ్రతకాలనేది పాశ్చాత్య సిద్ధాంతం, దాన్ని అలవర్చుకోవడంవల్ల సమిష్టికుటుంబం విచ్ఛిన్నం అవుతుంది. ఆస్తులకోసం కొట్లాటలు బైలుదేరుతాయి. అంటే మేష్టరు మన్ని ప్లీడరు దగ్గరికి పంపిస్తాడు, ప్లీడరు కాస్త ఆస్తిని అయన లాక్కుని, మనోవ్యాధిని మన కప్పజెప్పి మన్ని డాక్టర్ దగ్గరికి పంపిస్తాడు. సరే, అయన ఏకంగా మన్ని పరోలోకానికి పంపిస్తాడు.

గోపు : (మధ్యలో, మీ దసకున్నంత దారుణం కాదండోయ్ —

డాక్టర్. వ్యాధికి మాంచి పేరెట్టిన తర్వాత కాని రవాణా చెయ్యడండోయ్! మిస్టర్ రెడ్డీ, క్షమించాలి.

సూర్య: మిస్టర్ కాదు, ప్రొఫెసర్ రెడ్డి.

గోపు: రైటో! ప్రొఫెసర్, క్షమించాలి. మీరు చేసిన విమర్శ పాశ్చాత్యనాగరికతనిగురించి కాని మన సంఘాన్నిగురించి కాదేమో!

రెడ్డి: మీరు రెండు విమర్శలు విన్నారు: కరుణాకరంగారి గీతం పాశ్చాత్య నాగరికతని గురించి: త్రికోణం గురించిన వుపమానం మన సంఘంమీద నా విమర్శ—ఏం రాణీ!

రాణి: అఫ్‌కోర్స్:

గోపు: మీరందరూ ఏకమౌతే నే చెప్పలేనుగాని, మాడమ్ క్యూరీ అన్నట్లు—ఇన్ మై వొపీనియన్, మారేజీకి, ప్రేమకీ పొత్తు కుదరకపోవడం సంఘపతనానికి కారణం—

వాణి: అబ్బో. గోపాలం బావ ఏదో కోశేస్తున్నాడు. టీ తీసుకో, పాపం, టైరయ్యావ్.

కరు: గోపాలంగారి సిద్ధాంతాన్ని నేనూ బలపరుస్తున్నాను. ప్రేమించడం అనేది పాశ్చాత్యుల భ్రమ: మారేజ్ అనేది భారతీయులకి పవిత్ర విధినిర్వహణ.

గోపు: ఇక్కడెవ్వాళ్ళకీ పెళ్ళిళ్లు కాలేదు కాబట్టి మారేజ్‌కి పెదవుల చాకిరీ—'లిప్‌సర్వీస్' చేస్తున్నారు—ధూర్జటి అన్నట్లు. నే వింకా దూరం వెడతాను—ప్రేమలేని పెండ్లిండ్లని మెచ్చుగునేవాడెవడూ మారేజ్‌ని సీరియస్‌గా తీసుకోడు.

రెడ్డి: మారేజ్ అనేది దుఃఖాల స్వర్గం. వివాహం అల్లిన వలలో చిక్కుకోనివాడు ప్రతిభాశాలి.

గోపు: టేక్ ఫర్ ఇన్‌స్టైన్స్—కవులు

కరు: నన్ను విడిచిపెట్టండి.

గోపు: మీ రొక్కరేనా కవులు—అల్‌రైట్: టేక్ ఎ మాథెమాటికల్ జీనియస్ లైక్ శేఖరం—

వాణి: హియర్, హియర్, (చప్పట్లు కొడుతుంది)

సూర్య: బై ది బై, శేఖరం ఏడీ?

గోపు: బై అండ్ బై వొస్తాడు—బాస్వెల్ అన్నట్లు.

రాణి: ఎక్కడికి కెళ్ళాడో—చిట్టన్నని వెళ్ళి చూసి రమ్మను రాణీ—ఆలస్యం అవుతోంది,—మనం కానిద్దాం.

కరు: చీఫ్ గెస్టు లేకుండానా?

రెడ్డి: లైబ్రరీ కెళ్ళుంటాడు. కాసేపు వెయిట్ చేద్దాం.

సూర్య: సారీ, నే వెళ్ళాలి, టెన్నిస్ మాచ్ వున్నాయి. ఐతే, రాణీ, నువ్వు బాగా పాడతావుట—ఇప్పుడొకటి పాడగూడదూ?

కరు: అవునవును, పాడాలి,

రాణి: నే పాణ్ణు.

గోపు: పోనీ. వాణీ పాడుతుందేమో!

వాణి: నేనూ పాణ్ణు.

రాణి: అది పాడ్డం నే ఎప్పుడూ వినలేదు. వొస్తే పాడవే.—ఎవ్వరూ పాడొద్దు!—ఏడీ చిట్టన్నా (బిగ్గరగా పిలిచి), మొన్న నాటకంలో వేషం వేశావుటగా!

చిట్ట: అవును. శేఖరంగారు చంపుకుతింటే, సిత్తం, సిత్తం అనే ఏషం ఏశానండి. సిత్తం అండంలో బోలెడు రకా లుండాయండి, దర్జాగా సిత్తం. (అభినయిస్తూ) ఏడుస్తూ సిత్తం, హుషార్‌గా సిత్తం—

గోపు: శేఖరంగా రేం వేషం వేశాట్రా?

చిట్టన్న: అదేటో నాకు తెల్దండి— తాగడం. పాడ్డం అంతా వుంటుందండి,

రాణి: అబ్బో!

రెడ్డి : శేఖరం జీవితమే నటన. వేరే అభినయించక్కర్లేదు.

వాణి : అదేమిటండోయ్—?

రెడ్డి : బీదవాడి పాత్ర అభినయు చాలిగా.

కరు : ఆడిట్ సర్వీస్ ప్యాసై, యింకా అభినయం దేనికి?

సూర్య : ఇంకా గొప్పవాడుగా అభినయిస్తాడు.

(రాణీ, గోపూ, కరుణాకరం నవ్వుతారు)

రెడ్డి : అట్లాగైతే, మనందరిదీమాత్రం అభినయం కాదా ఏమిటి—

గోపు : ప్రొఫెసర్‌గా రెడ్డిగారు, కవిగా కరుణాకరంగారు, రేస్‌హార్స్ స్పెషలిస్టుగా నారాయణగారు,—రాణీ ఏమో......(తడుముకుంటాడు)

వాణీ : (మందలిస్తూ) ఊ—నువ్వో? ఇతరులవి నీసొంతంగానూ, నీవి యితరులవిగానూ కోట్ చేస్తూ, సారస్వత ప్రియుడిగా—

గోపు : ఎ కాంప్లిమెంట్—ఎ పిటీ— కానైతే ప్రియురాలేదీ?

రెడ్డి : (నవ్వుతాడు)

రాణి : బాగానే వున్నాయి జోక్స్ చిట్టన్నా, లైబ్రరీ కెళ్ళి శేఖరం వున్నాడేమో చూసిరా.

చిట్టన్న : (దర్జాగా) సిత్తం—వెడుతున్నానండి (వెడతాడు)

గోపు : జోక్స్‌కావు—నగ్నసత్యాలు — కాండొరా చో నేకెడ్ ట్రూత్, టాల్‌స్టాయి అన్నట్టు ...

సూర్య : నే వెళ్ళొస్తా, టెన్నిస్‌కి టైమైంది.

కరు : నేనూ వెళ్ళాలి. ఇవాళ డబల్స్‌మాచ్ వుంది. రేపొస్తాగా మళ్ళా. రాజాకి కంగ్రాట్యులేషన్స్, యిది వరకే చెప్పగున్నాను. నాపైవేసుగెల్లాడు గనుక ప్యాసయ్యాడు.

సూర్య : రెడ్డిగారూ, మీరు రారా?

రెడ్డి : నేనో నిమిషం వుంటాను మావా డొకడు సివిల్ సర్వీస్‌కి కడుతున్నాడు శేఖరాన్ని దాని తఫిసీళ్ళడగాలి. మాట్లాడి పోతా —

సూర్య : రైట్, క్లబ్బులో కలుసుకుందాం. (వెడతాడు)

కరు : వెడతాను.

రాణీ : మీరూనా ? ఏం తొందర ?

కరు : గెస్ట్సొహడాహుండికో వుంటావా మరి—(వెడతాడు)

గోపు : ఏమండోయ్ నూ చెస్ చూడ్డానికి నేనూ వొస్తున్నాను. (లోపలికెళ్ళి కోటు తొడుక్కొని వెళతాడు)

రాణీ : నా కార్లో వెళ్ళండి. వాణీ, శారదగారి తాలూకెవరో వొచ్చి వున్నారు. ఫోన్ పెట్టి, వాళ్ళని ఎంగేజ్ చెయ్యి.

(వాణి వెళ్ళుతుంది—లోపల్నుంచి సన్నగా గ్రామఫోన్ సంగీతం)

రెడ్డిగారూ, మీ రింగ్లండ్ వెడుతున్నారట ?

రెడ్డి : అప్పుడే మీదాకా వొచ్చిందీ—

రాణి : మీరు చెప్పకపోతే ఆగుతుందా ?

రెడ్డి : రాజా చెప్పాడా ?

రాణి : రాజా ఎవరు ? — ఓహో, శేఖరమా—మాతో ఇట్లాంటి వేవీ చెప్పడు—ఆయ నెక్కడా, చాలా...

రెడ్డి : అత నట్లాంటివాడు కాదే—

రాణి : మీరంతా ఫ్రెండ్స్—మీకు తెలియాలిగాని నా కేం తెలుస్తుంది ? మా యింట్లోమట్టుకు అసలు మాట్లాడ్డం వొచ్చా అన్నట్లుగా వుంటాడు.

రెడ్డి : క్లాస్‌లో చాలా అల్లరిచేసేవాడు.—మాతో చలాకీగా వుండేవాడే—

రాణి : మీ రన్నట్లు, మాతో అదంతా వో నటనన్నమాట—పోనిస్తురూ అతని విషయం ఎందుకు—మీమాట చెప్పండి.

# ఆత్మవంచన

రెడ్డి : చెప్పేటందు కేముంది ? ఆక్స్‌ఫోర్డ్ వెడదా మనుకుంటు న్నాను. మా తాత వొద్దంటాడు.

రాణి : (నవ్వి) ఓల్డుపీపుల్ అల్లాగే అంటుంటారు అమ్మకూడా అంతే.

రెడ్డి . మీరూ ఇంగ్లండెడదామని సంకల్పించారా ఏం ?

రాణి : నన్నెవరు తీసికెడతారు ?

రెడ్డి : అవును—నిజమే, ముందుముందు శేఖరానికి వెళ్ళే అవ కాశం వుండొచ్చు. అతను నిజంగా వెళ్ళవల్సిన వాడుకూడా.

రాణి : సరే, వెళ్ళడాని కేముంది,—ఎవడు పడితేవాడే వెళ్ళొచ్చు డబ్బుంటే—పైగా యీ రోజుల్లో అడ్డమైన వాళ్ళు ఇంగ్లండెళ్ళడమే —మా గోపూ వెడతాడు—

రెడ్డి : అన్యాయం—అవుతే నే వెళ్ళడం మానేస్తాను.

రాణి : మీవిషయం వేరు.

రెడ్డి : నాకు తెల్సు, తమాషాగా అన్నాను.

రాణి · మీలాంటివారు మాకు ప్రొఫెసర్లయినా బాగుండును. నాకు యీ కాలేజెసే యిష్టం లేదండి. ఇక్కడ ఫ్రీడమ్ వుండదు. కల్చర్ వుండదు—ఏదో పర్దాలో వున్నట్లుగా వుంటుంది నాకు ఇంగ్లండులో సోషల్‌సైన్స్ డిప్లమోకు చదవాలనుంది. మీ సలహా ఏమిటి ?

రెడ్డి : నే నెల్లా చెప్పగల్ను. అది ఎవరికి వారే నిర్ణయించు కోవాలి. బిట్వీన్ అవర్‌సెల్వ్స్—స్త్రీల కంతంత పెద్దచదువు లనవసర మనుకునేవాళ్ళల్లో నే నొకణ్ణి.

రాణి : ఏమోనండి. పైకి మొగాళ్ళెన్ని కబుర్లు చెప్పినా, స్త్రీల విషయం వొచ్చేటప్పటికి స్వార్థపరులేనండి.

రెడ్డి : ఆ పరిస్థితుల్లో స్త్రీలూ అంతే.

రాణి : చూస్తాగా, మీ రెట్లాంటావిణ్ణి పెళ్ళిచేసు కుంటారో :

రెడ్డి : బాబోయ్! అవుతే నే పెళ్ళే చేసుకోను.

రాణి : మీయిష్టమే—మీతాతగార్లేరు? (నవ్వుతుంది)

(రెడ్డి రాణి రిస్ట్‌వాచ్‌లోకి చూచి)

రెడ్డి : అబ్బో, ఆరవుతోంది. శేఖరంజాడ కనబడదే, నాకు లేటవుతోంది.

రాణి : నా రిస్టువాచ్ చూశారా—చూడండి. కొత్త మోడల్. కల్‌కటాలో కొన్నా. (తీసి యిస్తుంది)

రెడ్డి : చాలా బాగుంది—(యిస్తాడు)

రాణి : ఈ శారీ చూశారా? కరుణాకరం తెగమెచ్చుకున్నాడు. (బల్లమీద పువ్వులగుత్తి తీసుకుని వాసన చూస్తుంది)

అమ్మ : ఇవి వాళ్ళ గార్డెన్‌లోవిట:

రెడ్డి : మీ బర్త్‌డే ఎప్పుడో చెప్పండి. నేనూ మీ కేదేనా ప్రెజెంట్ యివ్వాలి.

రాణి : మీకు చాలా ఫార్మాలిటీస్ వున్నాయి— ఇంగ్లండులో ఎల్లా వుంటారో.

రెడ్డి : అసలక్కడే ఫార్మాలిటీస్ జాస్తి, పైగా నేను ఫార్మల్‌గా యివ్వడం కాదు.

రాణి : నిజంగానే—?

రెడ్డి : మరి నే వెడతాను, శేఖరంతో చెప్పండి. (లేస్తాడు)

రాణి : మీరే వొచ్చి చెబుదురూ

(రెడ్డివెడతాడు. రాణి లోపలి కెడుతుంది)

[రాజశేఖరం మెల్లగా ప్రవేశించి, కండువా సోఫామీద పడేసి, మూలగదిలోకి వెళ్ళి బల్లమీద పత్రిక తియ్యబోతూంటే పక్కనున్న సాసర్ కిందపడి పగుల్తుంది. 'ఎవిటది' అనుకుంటూ రాణీ వొస్తుంది]

రాణి : ఎవరది—?

# ఆత్మవంచన

రాజ: నేనేనండి. (గాజుపెంకులు తీస్తూ) దూరంగా - గుచ్చు కుంటాయ్,

రాణి: నాకు గుచ్చుకుంటే నీకేం ?

రాజ: (తడబడుతూ) మీకు కాదు నాకు గుచ్చుకుటాంయి.

రాణి: నావీ కాళ్ళే.

రాజ: (తడబడుతూ) ఎవరికేనా గుచ్చుకుంటాయంటి. (అవన్నీ కాగితంలోకి ఎత్తి బల్లమీద పెట్టి కుర్చీలో కూర్చుంటాడు.)

రాణి: ఎక్కడికి కెళ్ళావ్ శేఖరం ?

రాజ: లైబ్రరీకి వెళ్ళా మధ్యాహ్నం.

రాణి: నీకోసం పార్టీ ఇస్తోంటే అల్లా వెడితే ఏమైనట్టు ?

రాజ: అల్లాగా! — ఈవేళే! నాకు తెలియదు — క్షమించాలి

రాణి: అందరూ నవ్వారు తెలుసా... ? అని

రాజ: మొన్న చూచాయగా అన్నారుకాని ఈ వేళే అని చెప్పారు కాదు.

రాణి: ప్రత్యేకంగా చెప్పాలా ? సు వ్వామాత్రం గ్రహించు కోవద్దూ ?

రాజ: పైగా సాయింత్రం హాస్పిటల్‌కు వెళ్ళాను.

రాణి: ఎందుకో ?

రాజ: రాఘవరావుగారిని చూడ్డానికి వెళ్ళా

రాణి: అవును — ఇంట్లోవాళ్ళే మైతే నీకెందుకు ? ఎంతసిగ్గు — నలుగురూ నన్ను చూచి నవ్వడమే!

రాజ: క్షమించమన్నానుగా — ప్రతివ్యక్తి దగ్గిరికీ వెళ్ళి క్షమాపణ చెప్పుకుంటా.

రాణి: (నవ్వి) నీ స్నేహితు డొచ్చాడు.

రాజ: ఎవరు ?

రాణీ: నీకు 'లైఫ్' దానం చేసిన కరుణాకరం.

రాజ: ఓస్, అతనా—అతనితో నే చెప్పగుంటా, తర్వాత?

రాణీ: ఎవడో రెడ్డిట—ఆయనా వచ్చాడు. నువ్వింగ్లాం డెడ తావుటే?

రాజ: ఎవ రన్నారు?

రాణీ: అదుగో ఆ రెడ్డి,

రాజ: తమాషా కన్నాడేమో, గవర్నమెంట్ పంపిస్తే వెళ్ళాల్సి వస్తుందేమో?

రాణీ: అబ్బో—ఇంక మేం కనిపిస్తాం? అవుతే నువ్వు చాలా అల్లరి చేసేవాడవుటగా.

రాజ: అంటే?

రాణీ: మాముందు అమాయికంగా నటిస్తావుట— సూర్యనారాయణగా రన్నాడు.

రాజ: వారల్లా అనుకుంటే నే నేం చెయ్యగల్ను?

రాణీ: ఓస్, అందరూ నీ స్నేహితులేగా!

రాజ. వారంతా మీకు పరిచితులే.

రాణీ: అందుకనా రాలేదు పార్టీకి?

రాజ: నా కెప్పుడూ ఆ వుద్దేశ్యం లేదు. మీస్నేహితులందరూ నాకూ స్నేహితులే.

రాణీ: అబ్బో! ఎంత వుదారస్వభావులు!

రాజ: (వూరుకుంటాడు)

రాణీ: మాటాడవేం?

రాజ: ఏం మాట్లాడను?

రాణీ: బైట గంటలు గంటలు లెక్చర్లిస్తావుటగా?

# ఆత్మవంచన

రాజ : ఏమనాలో తెలియటంలేదు.

రాణి : ఆలోచించుకునే అను.

రాజ : వాణీ, గోపూ ఎక్కడికి వెళ్ళారండి ?

రాణి : వాణి మీది కెళ్ళిందేం— ?

రాజ : లైబ్రరీలో ఏదో బుక్ కావాలంది— అది దొరకలేదు.

రాణి : అబ్బో ! చాలా దూర ముందే !

రాజ : రాణీ. నువ్వు పొరబడుతున్నావు.

రాణీ : అవును, మా తప్పులన్నీ నువ్వే దిద్దాలి మరి.

రాజ : నా వుద్దేశ్యం అది కాదు.

రాణి : నీవుద్దేశ్యం నా కెట్లా తెలుస్తుంది— నీ అంతరంగిక స్నేహితులకి తెలియాలి కాని.

రాజ : నా కల్లాంటి స్నేహితు లెవ్వరూ లేరు.

రాణి : అవును ! నీకు మాతో స్నేహం ఎల్లా వుంటుంది ? మేం చెడ్డవాళ్ళం : మావల్ల ఎన్నో బాధలు పడ్డావు

రాజ : నే నల్లా అనకోటంలేదు— మీకే నావల్ల ఎంతో కష్టం.

రాణి అవును పాపం. నాలుగు రోజులు వోపికపడితే వుద్యోగం లోకి వెడతావు— స్వేచ్ఛగా వుంటావు.

రాజ : నేను మీ ఇంట్లో ఎప్పుడూ స్వేచ్ఛగా నే వు టున్నా

రాణి : మేం మంచివాళ్ళం కాముగా, అవునా ?

రాజ : మీ మంచిచెడ్డలు నిర్ణయించేందుకు నేనెవర్ని.

రాణి : పోనీ కరుణాకరం మంచివాడా, సూర్యనారాయణ మంచి వాడా ?

రాజ : అదేమి టల్లా గడుగుతున్నావు ? నాకేం తెలుస్తుంది ?

రాణి : నీ ఫ్రెండ్సేగా.

రాజ : అపునసుకో—ఏవిషయంలో మంచి—?

రాణి : అన్నింటిలోనూ.

రాజ : నాకంటె మీకే బాగా తెలియాలి.

రాణి : అవేమ్మాటలు—ఈర్ష్యా ?

రాజ : తప్పు. మర్యి నాకు యీర్ష్య దేనికి ?

రాణి : వాళ్ళ సిరిసంపదా, దర్జా చూసి.

రాజ : నా కెప్పుడూ యీర్ష్య లేదు. పాపం వాళ్ళు నాకేం అన్యాయం చేశారు ?

రాణి : నాకు అన్యాయం చేశారా ?

రాజ : ఆ విషయం నేయెల్లా చెప్పగల్ను, మీకే తెలియాలి.

రాణి : అదే వొద్దన్నది.

రాజ : తప్పుగా తోస్తే క్షమించు, ఈ ప్రశ్నలెందు కడుగుతున్నట్లో నాకు తెలీడం లేదు.

రాణి : తెలుసుకోడం నీవిధి సివిల్‌సర్వీస్ ప్యాసయ్యావు. ఎరువు షైలు, సూట్లు వేసుగుని—

రాజ : ఎరువేముంది—అన్నీ మీ రిచ్చినవే. నా ఋణం కొద్ది రోజుల్లో తీర్చుకుంటా ననుకుంటున్నాను.

రాణి : ఏవిధంగా ?

రాజ : ఏవిధంగా ఋణపడ్డానో, ఆవిధంగానే.

రాణి : వడ్డీ లే దన్నమాట ?

రాజ : అంటే ?

రాణి : ఆలోచించుకో.

రాజ : రాణీ, మీ కుటుంబంలో అందరూ నన్ను మీలోవాడిగా చూసుకుని, యింతవరకూ తెచ్చారు. మీ యందు వుంటున్న గురుభావం యిప్పు డెల్లా పోతుంది ?

రాణి: యేదో వొకభావం వుందికదా,—పోనీ అదీ మెయగే— మనకే కదా పెద్ద వుద్యోగం కాబోతోంది అని అన్ని భావాలూ వొదిలించుకుని పోడంలేదు—మేం ధన్యులం.

రాజ: మీరు చేసిన మేలు నే నెన్నడూ మరవను, నువ్వే చూస్తావుగా.

రాణి: ఇప్పుడు చూస్తూనే వున్నాను.

రాజ: ఏమన్నా లోటుంటే తెలియపర్చు. దిద్దుకుంటాను.

రాణి: దిద్దేటందుకు నే నెవర్ని? పెండ్లి చేసుకున్న తర్వాత, మీ ఆవిడొచ్చి దిద్దుతుందిలే.

రాజ: నాకు పెళ్ళిచేసుకునే వుద్దేశం లేదు.

రాణి: అబ్బో!

రాజ: పైగా నన్నెవరు చేసుగుంటారు?

రాణి: నీకేం—పెద్ద వుద్యోగం చేస్తున్నావు—గొప్పవాడవయ్యావు.

రాజ: గొప్పని, వుద్యోగాన్ని, హోదాని చూసి చేసుకున్న పెండ్లి యెంతకాలం నిలబడుతుంది?

రాణి: చాలా అనుభవంవున్నట్లే మాట్లాడుతున్నావే?

రాజ: క్షమించండి. మీదగ్గర అనవల్సినవి కావు.

రాణి: ఏం—నే అంత తగనిదాన్నా?

రాజ: నా అభిప్రాయం అదిగాదు—ఇప్పుడే వొస్తాను.

రాణి: వాణీ. గ్రామఫోన్ ఆపుచెయ్యి—ఇంకెందుకు. అందరూ వెళ్లారుగా—చిట్టన్నా—వొరేయ్.... యీ గాజుపెంకు అవతల పారెయ్యి (వెళుతుంది)

వాణి: (వొచ్చి) ఎక్కడికెళ్లావ్ శేఖరం? అక్కయ్య విసుక్కుంటోంది?

రాజ : అవునమ్మా, తప్పు జరిగింది, క్షమించమన్నాను.

వాణి : ఏమిటి చాలాసేపు మాట్లాడింది ?

రాజ : అబ్బే ! ఏమీలేదు — పార్టీ ముచ్చట్లు.

వాణి : చెబుదూ, నాకు తెలుసు.

రాజ : ఇంకేమీ లేదు,

వాణి : నువ్వు చెప్పవు.

రాజ : ఏమీ లేదన్నానుగా — ఉద్యోగంవిషయం, అవీ యివీను, నీ పుస్తకం దొరకలేదు,

వాణి : ఫరవాలేదులే.

(రాణీ మళ్ళా వస్తుంది)

రాణి : ఇక్కడున్నావుటేవాణీ — ఏవో రహస్యాలు కాబోలు !

వాణి : రహస్యాలేమంటా యక్కయ్యా ? అల్లాఅనడం యేమీ బాగాలేదు. ఇంకా నీకే వున్నాయి ఆ రహస్యాలన్నీను.

రాణి : నోర్ముయ్.

వాణి : ఎందుకు ముయ్యాలి ? ఇంకా నువ్వే......

రాణి : చప్ ! (కొట్టబోతుంది)

వాణి : మరే కొడతావూ, నీయిష్టం వొచ్చినట్లు ఆటలుసాగుతుంటే (ఏడుస్తుంది) అందరూ యెప్పుడూ నీచుట్టూ, నిన్ను పొగుడుతూవుండాలి కాబోలు, అమ్మరానీ చెబుతాను?

రాణి : చాల్లే యేడుపు — వాళ్ళందర్నీ సాగనంపు. లే. వెళ్ళ గోపు వొచ్చి వోదారుస్తాడులే.

వాణి : నిన్నెవరూ వోదార్చేవాళ్ళు లేరనేనా నీయిది,

(రాజశేఖరం దూరంగా వెడతాడు. శాంతమ్మ ప్రవేశిస్తుంది)

శాం : ఆదేమిటర్రా, అవతల వాళ్ళంతా వుండగానే మీ పొత్తులు

బాగానే వుంది—ఎల్లాగ్రా మీతో—అప్రదిష్ట శేఖరం ఏమనుకుంటాడు?

రాణి: నీకుటుంబకీర్తి నిలబెట్టే శేఖరం వున్నాడుగా నీకు బెంగెందుకు? (పూలగుత్తి నలిపి పారేసి వెడుతుంది)

శాం: మీరు దబ్బున పెళ్ళిళ్ళుచేసుకుని మొగుళ్ళవెంట పోతేగాని లాభంలేదు.

(గోపాలం కోటు భుజంమీద వేసుకుని రకాలుతో ముహాం తుడుచుకుంటూ ప్రవేశిస్తాడు)

గోపు: అత్తయ్యా మొగుళ్ల విషయం ఎత్తినప్పుడు నన్ను మర్చిపోకేం మరి?

శాం: రేపు వాణిని నీతో మీవూరు తీసుకుపోదూ.

గోపు: గొప్పసలహా అత్తయ్యా రిపీట్ చెయ్యకతప్పదు—స్త్రీలు సృష్టికర్తలు. షా అన్నట్లు (ఏడుస్తున్న వాణి దగ్గిరకు వెళ్లి బుజ్జగిస్తూ) వాణీ—లే—నువ్వు—నువ్వు-కన్నీరు—ప్రతిబింబిస్తూ—డైమండ్. డ్రైడన్ అన్నట్లు "సిరికంఠ కంట కన్నీరువొలికిన—"పద్యం సరిగా రాదులే.

# ఆత్మవంచన

## [మూడో అంకం]

## 1

సమయం—ఉదయం

స్థలం—అదే భవనం.

[వాణి బల్లలూ, కుర్చీలూ సర్దుతూ వుంటుంది. గోపాలం ఆమెకి సహాయం చేస్తూంటాడు. తెల్లటి ప్యాంట్, బ్లూ బ్లేజర్ కోట్, టెన్నిస్ జోళ్లు అతని వేషం. వాణి ఛార్మింగ్‌గా తయారవుతుంది.]

వాణి : ఏం బావా, రేపే వెళ్లిపోవాలా? మీనాన్న సంబంధాలేమన్నా చూస్తున్నాడా?

గోపు : సంబంధాలు నేను చూసుకునే ఖర్మమేం—అసలింత వరకూ నన్ను బ్రహ్మచారిగా వుండనిచ్చినందుకు, రాష్ట్రం అంటూ రాలేదు గాని, లేకపోతే. ఆంధ్రదేశానికి కృతజ్ఞత చెప్పుకోవలసిందే, అవుతే— "రేపు" అంటున్నావు—విశేషం ఏమిటి? టెన్నిస్ ఫైనల్స్ ఇవాళే గా.

వాణి : ఏంలేదు. ఇవాళ మనింటికి శేఖరం ప్రియురాల్ని తీసుకొస్తున్నాడా. ఆవిడ పేరు తెలుసా?

గోపు : విన కుతూహల పడుచుంటి?

వాణి : పూర్ణిమాచంద్రికాబోస్,

గోపు: బ్యూటిఫుల్, బెంగాలీగర్లా?

వాణి: మనవాళ్ళే, బెంగాలులో వుండిపొయ్యారుట. ఇంటర్ పూర్తిచేసి, శాంతినికేతన్‌లో ఆర్టు అభ్యసించి. అదివిరమించి మెడిసిన్‌లో చేరిందిట.

గోపు: త్రిల్లింగ్,! ప్రియురాలంటున్నావు ఏమిటి కథ?

వాణి: ప్రియురాలంటే ఏమిటో తెలీని అమాయకుడవు. రేపు పెళ్ళెట్లాచేసుగుంటావో పాపం!

గోపు: అసలు పెళ్ళంటె ఏమిటో తెలీదుమనకి—మేరీకో రెల్లీ అన్నట్టు.

వాణి: పోనీ ప్రేమంటే తెలుసునని కోసేశావ్!

గోపు: అదా—పురుషుడు ప్రేమకోసం పెండ్లి చేసుకుంటాడనీ, పురుషుడికోసం స్త్రీ పెండ్లిచేసుకుంటుందనీ. ఏట్లోరామన్న అన్నమాటిది.

వాణి: అబ్బా చాలా టైమయింది, వాళ్ళింకా రాలేదేం. చెప్మా. మనం వాళ్ళశెలూన్‌కి వెళ్ళితీసుకొద్దామా?

గోపు: ష్యూర్లీ సరాయన్ అన్నట్లు.

(వెడతారు)

[చిట్టన్నవచ్చి, సోఫాలు, కుర్చీలుసర్ది కాలెండర్ కాగితాలు చాలా చించి, 'అరె ఇది క్రితం సంవత్సరందే' అని ఆవులించి కన్నుమూస్తాడు.

శేఖరం, పూర్ణిమచంద్రికాబోస్ ప్రవేశిస్తారు. పూర్ణిమ సన్నగా, పొడుగ్గా వుంటుంది. మంచిఛాయ, అమాయకంగా కనపడే చిన్నకళ్ళు తెల్ల ఖద్దరుచీర—పొడుగాటిజడ—మెడలో వొంకులేగొలుసు. చేతులకేమీ వుండవు. ఎడంచేతికి మల్లెపూలదండతప్ప. శేఖరం సిల్కుపైజామానీ, తెల్లషర్టునూ వేసుకుంటాడు. పూర్ణిమ కొంచం యాసతో మాట్లాడుతుంది.]

రాజ : ఇదే రాణి గారిల్లు. (అటూ యిటూ చూచి) ఎవ్వరూ లేరు. మనకోసం వెళ్లివుంటారు.

పూర్ణి : భాగ్యవంతులల్లెనే వున్నారు.

రాజ : చెప్పొగా వీరితండ్రిగారుకలెక్టర్ చేసి రిటైరై చనిపోయ్యారు. నాకోటిజ్ఞాపకం వొస్తోంది. నేను పెద్దపరీక్ష ప్యాసైనప్పుడు వీరోపార్టీ యిచ్చారు. దానికి నేనులేను. వారింటికి మనంవచ్చాము వారులేరు.

పూర్ణి : వీరుంటే వారులేరు. వారుంటే వీరులేరు. వీరు వారూ వుంటే నేమలేను అవునా?

రాజ : చూడు — ఈ కుర్చీమీదే నాచదువంతా.

పూర్ణి : కుర్చీకూడా చదువు పట్టిందా?

రాజ : చదువుమాట తెలీదుగాని నల్లులంటాయి దేవీ!

పూర్ణి : సంతసించితిని.

రాజ : నా భక్తికి సంతసించిన, యీ దీనుడు వేడుకొనుచున్నాడు. వొక వరము ప్రసాదించుదేవీ.

పూర్ణి : అవశ్యమడుగుము.

రాజ : ఈ భక్తుడు, తమ పాదాల చెంతనే. నిత్యమూ సందర్శిస్తూ-

పూర్ణి : ఇచ్చితిని. కాని పాదాలను తాక వీలులేదు.

రాజ : దేవీ- అవి పాదములా — నేత్రములే పాదాలుగా, భూమిని ప్రతిబింబించి, వెలిగించే, చలిత్వాల లవి.- అన్నాడు ఎక్కడో చెకోవ్!

పూర్ణి : అదేమిటి?

రాజ : వాళ్ళ గోపాలు, ధోరణి. వాళ్ళని ఇమిటేట్ చెయ్యనా. నేను రాణీననుకో! వాణీ, గోపాలం ఏడీ?

గోపు : ఇక్కడిద నక్కియుంటిని, కుక్కన పేనువోలె, హరీంద్రనాధ్ చటోపాధ్యాయ యన్నట్లు.

రాణి : గోపూ నువ్వెళ్ళు సూర్యనారాయణ్ణి తీసుకురా.. గోపూ వాణీ నువ్వెళ్ళి చిట్టన్నని తీసుకురా. వాణీ చిట్టన్నా నువ్వెళ్ళి...

(చిట్టన్న వులిక్కిపడి లేస్తాడు. తొందరగాలేచి, కళ్ళు నులుముకొని)

చిట్టన్న : మీరండి బాబు. ఎవరో అనుకున్నా. రండి కూర్చోండి.

రాజ : నువ్విక్కడే వున్నావా, చిట్టన్నా చూళ్ళేదు.

చిట్టన్న : బాగుండారాండి.

రాజ : ఆ– నువ్వెల్లా వుంటున్నావ్. ఈమధ్య నాటకాల్లో వేషా లేస్తున్నావా ?

చిట్టన్న : మీ రెళ్ళింతర్వాత. సర్దా అంతా సచ్చిందండి.

రాజ : వీరంతా ఏరీ.

చిట్టన్న : మీ కోసమే వెళ్ళారండి. అదుగో వొస్తుండాడు.

(రాణి వొస్తుంది.)

రాణి : ఏం చిట్టన్నా, వొంటాయనవన్నీ సిద్ధంచేశావా ? పూర్ణిమ కోకోకాని, కాఫీ తాగదు. ఏంగోపాలం, మీ రెక్కడికెళ్ళారు. రండి.... వాణి, లోపలికెళ్ళి అన్నీ చూడు.

రాజ : వీరేనా ఇల్లాకూర్చోండి.

(నమస్కారాలు జరుగుతాయి)

రాజ : గోపాలం! ఈమె నాస్నేహితురాలు, పూర్ణిమాచంద్రికా. పూర్ణిమా, నేను చెప్పేవాణ్ణే—యీమె కౌముదీరాణీ—ఆమెచెల్లెలు వాణి వారిబావ గోపాల్.

పూర్ణిమ : అందరికీ ధన్యవాద్ !

గోపు : తెలుగు బాగా మాట్లాడుతారే !

పూర్ణి: మేం తెలుగువాళ్ళమే. మా తాత కలకత్తాలో వుండి పోయ్యాడు. మా న్న బిజినెస్‌లో వున్నారు.

రాజ : మా ఆఫీస్ దగ్గరలోనే వీరిల్లు. షిల్లాంగులో స్నేహం కలిసింది,

రాణి: బెంగాల్‌నుంచి వొచ్చారనగానే, ఎందుకో బెంగాలీలాల కనిపిస్తారు.

గోపు: భ్రమ — ఇల్యూషన్ అంటే అదే — వాతావరణంలో యిమిడిపోయేందుకు స్త్రీలకి దుస్తులు తోడ్పడతాయి, మిమిక్రియో — కమఫ్లయాజ్ — అంటారు.

రాజ : (నవ్వి) గోపాలం పెద్ద పరిశోధకుడు. స్కాలర్,

పూర్ణి : లేనిపోనివి చెప్పకయ్యా. ఋజువుచేసుకోడం కష్టం.

రాజ : రేనాల్డ్స్ అన్నట్లా!

వాణి : రాజాకి అన్నీ జ్ఞాపకమే యింకా—పెయింటింగ్ వొచ్చుటగా మీకు?

పూర్ణి : సరిగ్గా రాలేదు. నికేతన్‌లో నాలుగుమాసాలున్నాను. ఇక్కడికి ఏమీ తీసుకురాలేదు, కలకత్తా రండి మాతో,

రాణి : కలకత్తా వెదుతున్నారా?

రాజ : ఇప్పుడెక్కడ? ఇంకా నెలరోజులుంది.

పూర్ణి : నాతో రండి మీరు. రాజా తరవా తొస్తాడు,

రాణి : నా కిప్పుడు పడదు, ఇంట్లో అమ్మకూడా లేదు భూముల మీద కెళ్లింది.

రాజ : మీ అమ్మగారుకూడా వుంటే బాగుండును—పోనీ, రేపు రమ్మని వ్రాయకూడదూ?

రాణి : మొన్ననేగా వెళ్ళింది?

రాజ : పూర్ణిమ పాడుతుంది. ఆవిడ వుంటే పాటవిందురు.

వాణి : మేమూ వినొచ్చులెండి.

పూర్ణి : రాజా పాడతాడు, తెలుసా మీకు ?

రాజ : నే పాడానా, దొంగా—

వాణి : చిన్నప్పటినుంచి శేఖరం మాయింటోనే వుండి చదువుకునేవాడు. అతని సంగతి మాకు తెలుసు. మీరు పాడండి.

రాజ : పాడు.

పూర్ణి : (పాడుతుంది)

వాణి : బాగుంది. బెంగాలీసంగీతం విని చాలారోజులైంది.

పూర్ణి : మీరు పాడండి.

వాణి . నేనా ? ఇంకా అక్కయ్య పాడుతుంది.

రాణి : అంతా మర్చిపొయ్యాను.

గోపు : ఏదీ రాణీ—ఆంధ్రదేశం అనుకోవడమేగాని, యెప్పుడూ నే వినలేదు—ఏదీ మృదుగానకళ— మోలియరన్నట్లు :

(రాణి గొంతు సర్దుకుని, అపశ్రుతులతో, కంగారు పడి అసందర్భంగా పాడుతుంది.)

పూర్ణి : సాధనచేస్తే మీకు బాగా వొస్తుంది.

వాణి : శాంతినికేతన్‌లో వున్నవారికి డాన్సుకూడా రావాలే.

రాజ : ఊఁ వొచ్చుగా. చెయ్యకూడదూ ?

పూర్ణి : సిగ్గేస్తుంది బాబు · పైగా గజ్జెల్లేకుండానే !

వాణి : మా అక్కయ్య ఆమధ్య డాన్సు నేర్చుకుంది. గజ్జెలు తీసుకొస్తాను. (వెళ్లితెస్తుంది)

(పూర్ణిమ డాన్సు చేస్తుంది.)

గోపు : మరిచా చెప్పినవ్‌కి టైమయింది—నే పోతాను. నమస్కారం, పూర్ణిమగారూ, మళ్ళా కలుసుగుందాం.

పూర్ణి : నమస్తే.

రాజ : గోపాలం, రెండురోజులు వొచ్చి నాతో వుండగూడదూ? స్పెషల్ కారేజ్ ఏర్పాటుచేస్తాను.

గోపు : తప్పకుండా, మాచెప్ చూడ్డానికి మీరందరూ రాగూడదూ?

రాణి : తరవాతొస్తాంలే.

(గోపాలం వెడతాడు)

వాణి : పూర్ణిమగారు యీరాత్రి మనింటో వుండిపోతారు, ఏం?

పూర్ణి : ఎందుకు? మా బంగ్లాకి పోతాం.

రాణి : ఏం రాజా, యిష్టంలేకపోతే నువ్వెళ్ళు. అవిడిక్కడుంటుంది,

రాజ : మీకు శ్రమదేనికని.

వాణి : శ్రమేముంది?

రాణి : పోనీ, వుంటాం—అల్లా షికారు తిరుగొద్దామా?

వాణి : నేనూ, పూర్ణిమా వెళ్ళొస్తాం కార్లో. రండీ, వూరు చూద్దురుగాని. (వెడతారు)

రాణి : ఏం, పెళ్ళిచేసుకోనన్నావు, వెనక?

రాజ : ఇంకా చేసుకోలేదుగా.

రాణి : నన్నెవరు లెక్కచేస్తారన్నావ్?

రాజ : పూర్ణిమ అమాయకురాలు,—ఎంతోసున్నిత మైనమనస్సు.

రాణి : నిన్ను లవ్‌చేసిందా?

రాజ : ఆవిషయం మేం ఎప్పుడూ తర్కించుకోలేదు.

రాణి : పోనీ, నువ్వు ప్రేమించావా?

రాజ : ఏమనాలో తెలీదు.

రాణి : అమ్మకి అన్ని వుత్తరాలు వ్రాశావు. పూర్ణిమ విషయం రాయలేదేం?

రాజ : ఇదేం విశేషంగా తోచలేదు.

రాణి : ఓహో, ఇదంతా ఋణం తీర్చుకోటం కాబోలు.

రాజ : వ్రాయకపోవడం తప్పైతే, నన్ను క్షమించాలి.

రాణి : మాముందు ఏమీ తెలీని అమాయకుడులా నటించటం, బైట రహస్యంగా ఎన్నెన్నో చెయ్యటం— యిదేనా కృతజ్ఞత?

రాజ : ఇందులో రహస్యం లేదు రాణీ, స్నేహితురాలు—యీ వూళ్లు చూస్తానంది. తీసుకొచ్చాను. వాళ్ళవాళ్ళందరికీ తెలిసే వొచ్చింది.

రాణి : పెండ్లిచేసుగునే వుద్దేశం వుందా?

రాజ : ఆ విషయంకూడా ఆలోచించుకోలేదు. చేసుగుంటే అందర్నీ ఎల్లాగు ఆహ్వానిస్తాను.

రాణి : అసలు చేసుగోనన్నావ్?

రాజ : రోజులు ఎప్పుడూ వొకలా గుంటాయా?

రాణి : అవును. నువ్వేక్కడ! గొప్పవాడ వయ్యావు. ప్రియురాల్ని వెదుక్కుంటూ బెంగాల్ వెళ్ళావు. మేం ఎక్కడ కనిపిస్తాం?

రాజ : అల్లా అనడం చాలా అన్యాయం. నే నేం తప్పుచేశాను?

రాణి : మరే,—నీకు ద్రోహం చేశాం గాదూ? ఇన్ని రోజులూ నిన్ను ఏడిపించుకుతిన్నాం— ఇప్పుడు స్వరాజ్యం తెచ్చుగున్నావు— పెళ్లి చేసుకునేవాడవ్ నువ్వొక్కడివేకాదులే.

రాజ : రాణీ, ఎందుకు నన్నిలా బాధపెట్టే మాటలంటున్నావ్?

రాణి : బాధపెట్టని అమాయకురాల్ని తెచ్చుగున్నావుగా! సుఖపడుదువుగాని—ఏరి కోరి సంపాదించుకున్నావ్!

రాజ : రాణీ, అనవసరంగా హింసిస్తున్నావు నన్ను. నీ కేం కావాలో ఆజ్ఞాపించు: శిరసా వహిస్తాను.

రాణి : ఆజ్ఞాపించేటందుకు నాకేం అధికారముంది? పూర్ణిమకే వుంది, బంగళాకి రమ్మంటే వెడతావు. వొద్దంటే మానతావు.

రాజ: పూర్ణిమకీ నాకూ వున్న సంబంధం వేరు.

రాణి పూర్ణిమ అపూర్వమైన స్త్రీ—నీ పెండ్లి అపూర్వమైంది. మహా మహావ్యక్తివే వివాహం చేసుకోదం లేదు—నేనూ చేసుకుంటు న్నాను.

రాజ: శుభవార్త—సంతోషం. ఎవర్ని?

రాణి: పంజాబీని కాదులే—సూర్యనారాయణ్ణి.

రాజ: మంచిది, కంగ్రాట్యులేషన్స్!

రాణి: పీడ విరగడైందనా?

రాజ: (తెల్లబోయి) రాణీ, నువ్వనవసరంగా నన్ను బాధపెడు తున్నావు. నీ మనస్సులో ఏదో వుంది. నేను నిన్ను అర్థంచేసుకోలేను.

రాణి: నా కసలు మనస్సుంటేగా—పూర్ణిమలా నే నార్టిస్టుని గాను

రాజ: అబ్బ! రాణీ మన సంభాషణలోకి పూర్ణిమని దింపాలా?

రాణి: అపురూపం—పాపం: అరిగిపోదులే—ఇంకా పెళ్లి చేసు కోలేదుగా.

(రాజా తల తిప్పేసి, దిగులుగా వొంచుకుంటాడు.)

రాణి: అంత మాట్లాడ్డం యిష్టంలేకపోతే. వాళ్ళతో నువ్వూ వెళ్ళలేకపొయ్యావూ?

(వాణీ, పూర్ణిమ వొస్తారు)

వాణి: పెకండు(టిప్పుకి ఎవ రొస్తున్నారు? లే, రాజా, వళ్లంతా దుమ్మడింది, స్నానంచేసొస్తా. అలా కూర్చో పూర్ణిమా—అక్కయ్యుం దిగా,—యీ ఆల్బమ్ చూస్తూవుండు.

(పూర్ణిమ ఆల్బమ్ చూస్తూ మధ్యమధ్య దూరంగా ముందుగదిలోవున్న రాజాకేసీ, రాణీకేసీ మాస్తుంటుంది.)

రాణి: నీ ప్రియురాలొచ్చింది — పాపం, యింకా యిక్కడే వున్నావేం?

రాజ : బైటికి వెళదామా ?

రాణి : అప్పుడు వెళ్ళకపోతే, యింకేమన్నావుందీ ! అయితే, శేఖరం, వెనకటికీ, యిప్పటికీ నాలో మార్పేమిటి ?

రాజ : ఏమో నాకేం తెలుస్తుంది ?

రాణి : అప్పటికంటె కొంచెం లావయ్యాననుకుంటా ?

రాజ : వయస్సులో ఆవేశమాద్పు లొస్తాయి.

[రాణీ అతనిదగ్గరగా వెడుతుంది.]

రాణి : ఏదీ నీ చెయ్యి చూపించు—యీ మధ్య హామిస్ట్రీ చదువుతున్నా—నీకు పెండ్లిరేఖ ఎట్లావుందో చూస్తాను (చెయ్యి పట్టుకోబోతుంది. అతను విదిలించివేస్తాడు)

రాజ : రాణీ, అంతదగ్గరగా రావడం మంచిదికాదు.

రాణి : ఏం. నిన్నేం బాధించనులే.

[శేఖరం జేబులోంచి నోటు సంచితీసి బల్లమీద పెడతాడు.]

రాణి : యీ సంచీ ఏమిటి ?

రాజ : సంచీలోవి రూపాలనోట్లు—మీ అమ్మగారికిస్తావా ?

రాణి : ఋణవిముక్తా ? అమ్మకేకాని నాకివ్వగూడదా ?

రాజ : వారు పెద్దలు, ఎవరికిచ్చినా వొకటే.

రాణి : దీని వుద్దేశం ఏమిటి ? రూపాయలతో సంబంధం అన్న

రాజ: మరి నాకెల్లా ప్రకటించాలో తెలియడంలేదు. నామాటలకి విపరీతార్థాలు తీస్తావు. చేష్టలకి కొత్తర్థాలు కల్పిస్తావు.

రాణి : ఇంతటితో నీకూ మాకూ రాం రాం అన్నమాట.

రాజ : ఆ వుద్దేశంతో కాదు. నే నెప్పటికీ మీ శ్రేయస్కామిని, కృతజ్ఞుణ్ణి.

రాణి : ధన్యులం.

రాజ : (దగ్గరగా) పూర్ణిమా, రా, ఇల్లా రా.

రాణి : యీ సంచిలో ఏముందో తెలుసా, పూర్ణిమా ? రా చూపిస్తాను. డాబామీది కెడదాం. చల్లగావుంటుంది.

చిట్టన్న : ఏమండీ నా కేదేనా పనిప్పిస్తామన్నారు గదంటండీ—

రాజ : తప్పకుండా యిప్పిస్తా—మాఆఫీసులోనే— యిప్పుడొస్తావా. దరఖాస్తు పెడుదువుగాని ?

చిట్టన్న : కొంత పని చూస్కునొస్తానండి—మీరెడుతూండండి— మీ బంగాళా కాడికే నాండి ?

రాజ : కాదు, ఆఫీసు దగ్గరకి రా, అక్కడుంటాను.

(వెడతాడు)

(కొంచెంసేపు విరామం)

రాణి : పూర్ణిమా, నిన్ను రాజా పెండ్లిచేసుకుంటా నన్నాడా ?

పూర్ణి : అన్లేదు. కాని చేసుకుంటాడు.

రాణి : దేన్నిబట్టి చెప్పగలవు ?

పూర్ణి : ఇవన్నీ మీ కెందుకు ?

రాణి : అవసరంగనుకనే అడుగుతున్నాను.

పూర్ణి : అంటే ?

రాణి : రాజానన్ను ప్రేమించాడు. చిన్నప్పటినుంచీ. - నిన్నెప్పుడూ చేసుగోడు. చేసుగుంటానని తీసుకొస్తే దగా అన్నమాట.

పూర్ణి : నాతో ఎప్పుడూ మీతో ఆ మాదిరి స్నేహంవున్నట్టు చెప్పలేదే ?

రాణి : పిచ్చిపిల్లా. ఏ మొగాడేనా పరోస్త్రీతో స్నేహంవున్నట్లు చెబుతాడా ?

పూర్ణి : నిజంగా—?

రాణి : నువ్వు చూడనేచూశావుగా - ఇంక ఋజులేఖలు అచ్చు పడాలి : అంతే ?

పూర్ణి : నేను నమ్మను. (ఏడుస్తుంది) రాజా అట్లాంటివాడు కాదు.

రాణి : అతను అందర్నీ అల్లాగే దగాచేస్తాడు. చిన్నప్పటినుంచి చూస్తూనే వున్నాను.

పూర్ణి : అంత దగాచేసేవాణ్ణి మీ రెల్లా చేసుకుంటారు ?

రాణి : న న్నొక్కదాన్నే నిజంగా ప్రేమించాడు — ఇప్పుడే మూడువేలిచ్చాడు —నువ్వు చూశావుగా ?

పూర్ణి : నే నింక ఇక్కడ వుండలేను—వెళ్లిపోతాను. రాజా యేడీ ? కారు తెప్పించండి, బంగ్లాకి పోతాను.

రాణి : కిందికి దిగు—వెడదాం.

వాణి : ఎక్కడికే ప్రయాణం అక్కయ్యా ? శేఖరం యేడి ?

రాణి : ఇప్పుడే వొస్తా. (వెడతారు)

వాణి : ఏరా చిట్టన్నా. ను వ్వెక్కడికి ?

చిట్టన్న : శేఖరంగారు రైల్వేలో నాకు పనిప్పిస్తా మన్నారండి ; ఎళ్లి చూసొస్తానండి—శలూన్ కాడుంటాను, రమ్మన్నారండి. (వెడతాడు)

(రాణీ వొస్తుంది)

వాణి : రాజా వొచ్చాడా ?

వాణి : పూర్ణి యేదీ ?

రాణి : వాళ్ళవాళ్ళు రమ్మని అర్జంటు టెలిగ్రాం యిచ్చారు, రైలు కెళ్ళింది,

వాణి : నిజంగానా ?

రాణి : నీతో నే వాదించను.

రాణి : వువ్వేమన్నా అన్నావా?

రాణి : అంటే—నీ కుచ్ఛితపు ప్రశ్నలకి నేను సమాధానం చెప్పను.

వాణి : నీదే కుచ్ఛితం, ఏదో చేశుంటావు, లేకపోతే ఎందు కెడుతుందీ ? శేఖరంజోలి నీ కెందుకు ?

రాణి : నోర్ముయ్. (కొడుతుంది)

వాణి : (ఏడుస్తుంది.)

రాణి : గోపూ వొచ్చి వోదారుస్తాడులే నీ యేడ్పు.

[ఇం ట ర్వ ల్]

---

# ఆత్మవంచన

## [నాలుగో అంకం]

## 2

సమయం—రాత్రి, స్థలం—అదే భవనం.

(ప్రక్కగదిలో వాణి స్టవ్ ముట్టించి ఏదో కాస్తూంటూంది. రెడ్డి ప్రవేశం)

వాణి : రెడ్డిగారా ? రండి. కూర్చోండి.

రెడ్డి : ఎల్లాగుంది శాంతమ్మగారికి ?

వాణి : ఇప్పుడే నిద్రపట్టింది—ఏం యిల్లావొచ్చారు ?

రెడ్డి : శేఖరంతో మాట్లాడేపనుంది — మాట్లాడిపోదామని— ఆఫీసుకెడితే యిక్కడి కొచ్చాడన్నారు.

వాణి : అబ్బే. లేదండీ. ఎప్పుడోగాని ఆయనగారు మాయింటికి రాడు, అడుగో—వెయ్యేళ్లాయుష్యయ్యేనీకు శేఖరం ! ఇప్పుడే నీమాట అంటున్నా.

(శేఖరం వొస్తాడు)

రాజ : ఎట్లావుంది అమ్మగారికి ? హలో,—రెడ్డీ

రెడ్డి : మీ రైల్వేవాళ్లు మా సామాను అమృతసర్ పంపడానికి పేచీ పెడుతున్నారట, కనుక్కుందామని.

రాజ : రెగ్యులేషన్స్ మారాయి—కొంచెం ఆలస్యం అవొచ్చురెడ్డి

రెడ్డి : నువ్వు రూల్సు, రెగ్యులేషన్స్ అని కూచుంటే లాభంలేదు. ఎవళ్ళకిరూల్సు ? పలుకుబడి లేనివాళ్ళకి.

రాజ : సారీ,—నేనూ వ్యూ తీసుకోలేక పోతున్నాను—అని అందరికీ సమానంగా అన్వయించాలనే నావూహ - రూల్సంటూ లేక పోతే అరాజకమే. మనుషుల్లోవుండే అరాజకాన్ని కేంద్రీకరించి, వో పంథాలో పెట్టడమే ప్రభుత్వాల కర్తవ్యం.

రెడ్డి : నే నీ లెక్చర్ కోసం నీదగ్గరికిరాలేదు. నువ్వు చెప్పింది నిజమైతే, వొక్కపని జరుగుతుందా ?

రాజ : నువ్వు దరఖాస్తు పెట్టావుగదా—చూస్తాను. ఆ కాగితాలు సూర్నారాయణగారు చూస్తున్నాడనుకుంటా.

రెడ్డి : ఆయనపైనేగానువ్వు - నిన్ను చూస్తే వొదిలిపోతుం దనుకున్నా.

రాజ : సక్రమంగావుంటే నే తప్పకుండా చేస్తాను.

రెడ్డి : సక్రమంగా వుంటే నువ్వు చేసేదేమిటి—ఏ క్లార్కైనా చేస్తాడు.

వాణి : ఏం శేఖరం, మా చిట్టన్నని పనిలోంచి తీసేశావుటగా— వాడిపెళ్ళాం గోలెడుతూంది.

రాజ : ఉద్యోగం పోయినమాట నిజమేకాని, తీసేసినందుకు నేనే బాధ్యుణ్ణికాను. మీసూర్నారాయణ పని అది. చిట్టన్న తప్పులెక్కలు చెప్పాడనీ, శిక్షించాలనీ కాగితాలు నాకు పంపాడు. నే నల్లా చెయ్యక తప్పిందికాదు.

రెడ్డి : నీ రూల్సు ధర్మమా అని వాడిపెళ్ళాంనోట్లో దుమ్మేశావ్.

రాజ : ఏంచేస్తాం రెడ్డీ, మనం చిన్నప్పుడనుకున్నంత స్వతంత్రులంకాము. ఎన్నో కట్టుబాట్లూ, ఆటంకాలూ వుంటాలు. వాటిని మనం ధిక్కరించలేం—నువ్వు ఫిలాసఫర్ వి. నీకు చెప్పవల్సినవాణ్ణి కాను.

వాణి : అవుతే, వాడి మాటేమిటి?

రాజ : ఏం చెయ్యను వాణీ? వాడి కిష్టమవుతే నా సొంతపనికి పెట్టుకుంటా. అంత జీతమూ యిస్తా, అమ్మగార్ని చూద్దామా లోపలికెళ్ళి?

రెడ్డి : సరే, నే వెడతానయ్యా రేపాఫీసులో కలుసుకుంటా.

రాజ : నువ్వు శ్రమపడి రానక్కరలేదు. నేనే కమ్యూనికేషన్ పంపుతాగా.

రెడ్డి : సరే చూస్తాను (వెడతాడు)

(వాణీ, రాజా లోపలికెళ్లి వోక్షణం అయ్యాక ప్రవేశిస్తారు)

రాజ : నే వెళ్లొస్తా వాణి, మళ్ళా రేపో, ఎల్లుండో వొచ్చిచూస్తా. ఐతే...(సందేహిస్తాడు)

వాణి : ఏం?

రాజ : ఇవాళ నీ బర్త్‌డే కదూ?

వాణి : అవును, నీకు జ్ఞాపకం వుందే!

రాజ : ఈ పుస్తకం తీసుకొచ్చాను,

[జేబులోంచి తీసి పుస్తకం యిస్తాడు]

వాణి . (చూసి చదువుతూ) టాల్‌స్టాయి: నా కెంతో యిష్టం. (నవ్వుతుంది)

రాజ: ఏం:

వాణి : టాల్‌స్టాయ్ అన్నట్లు : మా గోపాలంబావ మాటలు జ్ఞాపకం వొచ్చాయి. చాలా థాంక్స్.

రాజ : గోపాలం వచ్చింతర్వాత నాకు కబురు చెయ్యేం?

వాణి : నాకూ గోపు లేకపోతే తోచడంలేదు.

రాజ : నువ్వు చాలా చిక్కిపొయ్యావు. తెలుసా?

వాణి: ఏమిటో శేఖం... నిన్ను స్మరించుకుంటే, దిగులు తగ్గినట్టుగా వుంటుంది.

రాజ. అంతే. కాని—ఎప్పుడూ నేనూ చెప్పుకోవాలేమోకూడా.

వాణి: ఏం శేఖరం నువ్వూ అదోలా వున్నావేం?

రాజ: ఏమీ లేదు... ఏవో జ్ఞాపకం వస్తాయి. జీవితం యిట్లాగె పోతుందని భయమేస్తుంది తల్చుకుంటే,

వాణి: నీ కెందుకు భయం—నీ కేం తక్కువని?

రాజ: ఏమో వాణీ—ఏమీ తోస్తేకుండా వుండటంకూడా వో పెద్ద లోటనుకుంటా. పైటికి సుఖంగా వున్నట్లు కనపడతారు మనుషులు. పెద్దపెద్ద అఘాతాలుంటాయి.

వాణి: నాతో చెప్పకూడదూ—ఐనా, శేఖరం నాకు తెలీదనా నీ వూహ?

రాజ: మనం వొకరితో వొకరు చెప్పుకోకుండానే విశదమయ్యే సత్యాలెన్నో వుంటయ్యి.

వాణి: పూర్ణిమ దగ్గరనుంచి వుత్తరాలొస్తున్నయ్యా?

రాజ: ఎన్నోజాబులు వ్రాశాను, జవాబులేదు నేనే వెళదామనుకుంటున్నా. ఆఖరికి నిన్నవొచ్చిందీ వుత్తరం చదువు. చదవాలేను...

వాణి: ఏం? ఎందుకు అంతఅకస్మాత్తుగా వెళ్ళిపోయిందట? (చదువుతుంది) "ఆకాశంలో ఎన్నో మేఘాలుంటాయి. కొన్ని నల్లవి, కొన్ని తెల్లవి. గాలి వాటిని జాలిగా పిలుస్తుంది. కొన్ని వర్షిస్తాయి, కొన్ని కొండశిఖరానికి శిరస్సుల్ని కొట్టుకుని భగ్నమౌతాయి. నేనట్లాంటి మేఘాన్ని. నీ హృదయం ఆ కొండ శిఖరం. నా హృదయం దానికోసం భగ్నమైపోయింది. నీచుట్టూ నల్లటి మేఘాలు ఆవరించాయి. అవి లోకాన్ని చూడనీకుండా, నిన్ను మరుగు పరుస్తున్నాయి. ఆకొండ కింద లోయలో వర్షపు చుక్కకోసం నిరంతరం వేచివుండే, వొక చీకటిమొగ్గని నేను, అది

పుష్పించడానికి నోచుకోలేదు. శేఖరం...మట్టూ కుంభవృష్టి.. మధ్య ఆ మొగ్గచుట్టూ...ఎడారిలో ఏకాంతంగా వికసించకుండానే వాడి, నశించే వొంటరి పుష్పాన్ని...నేను. నక్షత్రాలు తప్ప నన్నెవ్వరూ స్మరించరు, (ఉత్తరం మడిచేసి చేతికిస్తుంది) ఎంత లోతైన హృదయం గలది ?

రాజ : అవునువాణీ! నష్టానష్టం చేసుకుంది....

వాణి : నాకు తెల్సురాజా...ఇది అక్కయ్య పని.

రాజ : వాణీ, నువ్వు ఎంతో గుట్టుగలదానివి. నీకు నేను వేరే చెప్పాలా ? పొద్దుపోయింది. (వెడతాడు)

(వాణి లోపలి కెడుతుంది, రాణి వొస్తుంది)

రాణి : (కోపంగా) వాణీ, యీ డబ్బాలూ, యివీ యిక్కడ పెట్టారే. (డబ్బాను తంతుంది)

వాణి : అబ్బ! ఇశ్! కేకలెయ్యకు అమ్మ నిద్రపోతోంది.... ఎక్కడి కెళ్ళావు ?

రాణి : ఎక్కడికో అక్కడికి, నీ కెందుకు ? (బల్లమీది పుస్తకం తీసి చూస్తుంది) ఓహో—అన్నా కెరీనైనా—నీదికాబోలు తియ్యాములే, (బల్లమీద పడేస్తుంది,)

వాణి : అమ్మని చూసెళ్ళాడు శేఖరం యిప్పుడే

రాణి : వేరే చెప్పనక్కర్లేదు, ఈ పుస్తకం చెపుతూనేవుంది. చాలా గ్రంథం జరుగుతోందే !

వాణి ; ఏమ్మాట్లక్కయ్యా ! నా బర్త్ డేట—అతను చెప్పేవరకూ నాకు జ్ఞాపకమే లేదు,

రాణి : అవన్నీ మర్చిపోతే యింత పుప్యోగం ఎల్లా చేస్తాడు. (జడలో పిన్నులుతీసి సోఫాలో గిరవాటేస్తుంది) గోపాలొకన్న మెరుగేలే !

వాణి : చాల్లె వూరుకో, నోటి కెంతొస్తే అంతేనా ?

రాణి : ఇంట్లో ఎవర్నూలేని సమయాలు బాగానే తెల్సుకున్నాడు;

వాణి : నువ్వు ఆతని బంగళానుంచే వొస్తున్నావా—శ్—శ్, వూరుకో—సూర్నారాయణ బావ వొస్తున్నాడు.

సూర్య: ఏమిటి కేకలేస్తున్నారు?

రాణి; వొచ్చారా? రండి, మీకోసమే చూస్తున్నా. పనికుర్రాడు, డాక్టర్‌కోసమని గంటనగా వెళ్లాడు, ఎక్కడికెక్కడే పారేశి.

సూర్య: రాణీ—శేఖరం ఏంచేశాడో విన్నావా? వొట్టి ఫూల్! చిట్టిన్నని వుద్యోగంలోంచి తీసేశాడు, వీడేదో దొంగపని చేశాట్ట.

రాణి: కండ్లు నెత్తిమీది కెళ్ళాయన్నమాట.

సూర్య: ఆఫీసులో మహా పెద్ద స్ట్రిక్టుగా వుండబోతాడు— అందరూ నవ్వడమే!

రాణి: బీదవాడికి అధికారం యిస్తే, యిల్లాగే తగులబడుతుంది. మీరు యిక్కణ్ణుంచి ట్రాన్స్‌ఫర్ చేయించుకోలేరూ?

సూర్య: కర్మ. దానికికూడా శేఖరం రికమెండేషనే కావాలి.

రాణి: నే వెళ్ళి అడగనా?

సూర్య: బాగుంటుందా?—అడుగో—ఏరా చిట్టిన్నా! ఉద్యోగం వూడిందిగా, ఏం చేస్తావు?

రాణి: వాడికేం మనదగ్గరే వుంటాడు,...

చిట్టిన్న: తప్పులెక్క చెప్పినమాట వాస్తవమేనండి — అయన కాడ యివన్నీ సాగవండి,

సూర్య: మహా పొడిచేశాడా ఏంరా? పెద్దపెద్ద వాళ్లే చేస్తారు అల్లాటి తప్పులు, మొన్న చెకింగులో అతను యివ్యాలేమా బోలెడుతప్పులు. నే చూపించా—థాంక్స్ అన్నాడు, అదే ఓ చిన్నధికారైతే ఏమౌను?

రాణి: నువ్వెల్లా వూరుకున్నావ్ చిట్టిన్నా? నాలుగూ అడగలేక పొయ్యావు! నేనైతేనా—ఏం చేద్దునో.

చిట్టిన్న: అదేటండి—కొట్టమంటా రేమిటి? ఖలేవారే ఇంకా నయం, ఆయన చేపుడండి—నా వుద్యోగం పోతేపోయిందిగాని తప్పుందీ, తీసేశాడు, నే నల్లాంటిపని చెయ్యలేనండి.

రాణి: ఖూనీ చెయ్యమన్నట్లు మాట్లాడతావేంరా దౌర్భాగ్యుడా— నే వెళ్లి అడిగొస్తా నుండండి.

సూర్య : నువ్వడగడ మేమిటి? ఏమన్నా మతోయిందా?

రాణి : అడిగితేం ఏంతప్పు?

సూర్య : అడిగితే మరీ చెప్తెక్కుతాడు.

వాణి : అతనట్లాంటివాడు కాదు బావా—?

సూర్య : అవసరంవాస్తే అక్కచెల్లెళ్లిద్దరూ వొకటే. నాకేం, ఇద్దరూవెళ్ళి అతని కాళ్ళమీదపడి ఘోరున ఏడవండి.

రాణి : ఏంమాట్లాండవి. అతని కాళ్ళమీద పడే ఖర్మమేం మాకు? మీరు ట్రాన్స్ఫర్ కావాలంటిరిగా, అదీ అడుగుతాను. ఏం?

సూర్య : మానాభిమానాలుండాలా! నాకు వాణ్ణి వీణ్ణి ప్రతిమాలడం యిష్టంలేదు. అంతగావాస్తే, నాలుగు మొహాన్నని, వుద్యోగానికి రాజీనామా యిచ్చి, హాయిగా కాలిమీద కాలేసుకు కూర్చుంటాను.

వాణి : బావా—మాట చెప్పనిచ్చారు కారు—అమ్మ కాయాసంగా వుంది. డాక్టరికి కబురుచేస్తే బావుండును.

సూర్య : అబ్బ- కొంపలో క్షణంవుండలేక పోతున్నాను. డాక్టర్ కోసం చిట్టిన్నని పంపండి. నాకో మీటింగ్ తగులడింది వెళ్లాలి.

[శేషం సర్దుకుంటూడు.]

రాణి : ఏమిటండి ఆ విసుగు. ఇప్పుడు మిమ్మల్ని ఎవరేమన్నా రని! శేఖరం పరాయివాడా—చనువు గనక అడుగుతానన్నాను.

సూర్య : ఇప్పుడా శేఖరం జోలెవరెత్తారు.

రాణి : విసుక్కోవడం కోసమే వుద్యోగం అనుకుంటే, రాజీనామా యివ్వండి.

వాణి : ఊరుకో అక్కయ్యా—మీ దెబ్బలాట్లకి సమయా సమయాలు లేవా ఏమిటి.

రాణి : నీకెందుకు నువ్వూరుకో వాణీ. ఈనాక్కరే చేస్తున్నారా వుద్యోగం...

సూర్య : అబ్బ-హెల్—నీకెంత సేపూ ఆ రాజశేఖరం గొడవే. నే పోతాను. (వెడతాడు)

[రాణి, పళ్లు పట పటా కొరుకుతుంది]

వాణి : అయిందా—అమాటకొస్తా అని పించుకునేదాకా, వూరుకున్నావు కాదు,

రాణి : మా యిష్టం—మేం ఏదో అనుకుంటాం. నీ కెందుకు. నువ్వెళ్ళి అమ్మసంగతి చూడు, చిట్టన్నా, డాక్టర్ గారింటికి తగులడు.

[రాజశేఖరం ప్రవేశిస్తాడు]

రాజ : నేనక్కడనుంచే వొస్తున్నాను. డాక్టర్ హరిహరం—నా స్నేహితుడు. గంటలో వస్తానన్నాడు. ఈలోగా వాడేటందుకు యీ మందిచ్చాన్నాడు (సీసా టేబిల్ మీద పెడతాడు)

[వాణి మందుసీసా తీసుకుంటుంది]

రాజ : వేన్నీళ్ళల్లో కలిపివ్వాలి,

[వాణి వెళుతుంది]

రాణి : చిట్టన్నని పనిలోంచి తీశేశావుట.

రాజ : అవును. అపచారం చేశాడు, ఈ విషయంలో నన్ను క్షమించాలి రాణీ.

రాణి : ఇదికూడా మా ఋణం తీర్చుకోడం కాబోలు !

రాజ : మీరల్లా అనకూడదు—ఉద్యోగం యిప్పించింది నేనే,

రాణి : నువ్వు పెద్ద అధికారివే. పదేపదే నొక్కి వక్కాణించనక్కర్లేదు.

రాజ : చిట్టన్న కభ్యంతరం లేకపోతే, నాదగ్గరే స్వంత నౌకరుగా పెట్టుకుంటాను.

రాణి : ఓస్ ! ఆమాత్రం మేమూ చెయ్యగలం,

రాజ : అల్లాగే కానీండి—నిజంగా నాకు నౌకర్లక్కర్లేదు.

రాణి : ఏం ? పూర్ణిమని చేసుకోడం లేదూ ?

రాజ : (జేబులోంచి కాగితంతీసి యిస్తాడు) ఇది చదువు.

రాణి : (చదివి) పూర్ణిమ ఆత్మహత్య చేసుకుంది — ఎందుకో పాపం, ఏమన్నా భరింపరాని జబ్బా — మరొకర్ని ప్రేమించి మోసపోయిందా ?

## ఆత్మవంచన

రాజ : ఏందుకో నీకే తెలుసు ?

రాణి : అంటే ? నీ వుద్దేశం ఏమిటి ? ఈ వార్త తీసుకుని తిన్నగా ఆఫీసునుంచి యిక్కడికే వొచ్చావు. నన్ను కోర్టుకీడుద్దామనా ?

రాజ : నన్ను క్షమించాలి, పొరబాటు నన్నాను. నా జీవితం యిల్లాగైపోయింది, నే నెవ్వరికీ వుపయోగంలేకుండా వున్నాను, నా మూలంగా వొక అమాయకురాలు నిష్కారణంగా చనిపోయింది.

రాణి : నీకు పూర్ణిమ వొకత్తేనా ప్రపంచంలో ?

రాజ : నా కింకెవ్వరూ లేరు.

రాణి : ఓయబ్బ ! మొగాళ్ళందరూ అల్లాగే అంటారు. యిష్టం వున్నంతకాలం వొకళ్ళతోనూ—తరవాత మరొకళ్ళ...

రాజ : పూర్ణిమ అట్లాగే అనుకుని హత్యచేసుకుంది, అది నిజమైతే నాకు బాధేవుండదు రాణీ....నిజం. నిజంకాకపోవడంకంటె విషాదకర మైన నిజమేముంది రాణీ.

రాణి : నేను మొద్దుని — నీ సత్యాన్వేషణ నాకెక్కడ అర్థమవు తుందిలే. మా ఆయనమీద అధికారం ఛలాయిస్తున్నావట.

రాజ : నేనూ, సూర్యం ప్రజాసేవకులం ఎవ్వరికీ అధికారం ఛలా యించే అవకాశం లేదు.

రాణి : ఆయనకి ట్రాన్స్‌ఫర్ కావాలిట,

రాజ : అది నా చేతుల్లో లేదు.

రాణి : మేం యిక్కణ్ణుంచి వెళ్ళిపోవడం నీ కిష్టమేగా ?

రాజ : ప్రపంచం నా యిష్టాయిష్టాలమీద నడవదు ?

రాణి : పోనీ, నీ యిష్టం ఎల్లాంటిదో చెబుదూ—

రాజ : నేను చెప్పలేను.

రాణి : చెప్పవన్నమాట ?

రాజ : రాణీ—నీకు భర్తవున్నాడు. అది నువ్వడగవలసిన ప్రశ్న కాదు.

రాణి : నీకు భార్యలేదు కాబట్టి చెప్పొచ్చుగా ! ఏదో మూఢురాల్ని అడిగాను. కానున్న భార్య మరణిస్తే, మేం సానుభూతి కనబరుస్తామని, మా యింటికి వొచ్చావుగాని, మా ప్రశ్నలకు సమాధానం చెప్పేటందుకు, మా కోర్కెలు తీర్చేటందుకు, మా కష్టసమయంలో ఆదుకునేటందుకు, వొచ్చావనుకున్నందుకు, నువ్వు మమ్మల్ని క్షమించొచ్చు.

రాజ : అంతటి లోతైన భావాలు గలదానివి—రాణీ, నీ నడక మాత్రం మెరకమీదనే, చిత్రం. గంటక్రితమే. మీ అమ్మగార్ని చూసి పోదామనివొచ్చాను.

రాణి : కృతజ్ఞులం. వొచ్చేనెల, గోపాలాన్ని వాణి పెళ్ళిచేసుకుంటోంది.

రాజ : అల్లాగా ?

రాణి : నీతో వాణి చెప్పిందటగా ?

రాజ : అవునవును. ఈమధ్య అన్నట్లుంది.

రాణి : అంత మందమరుపా— దాని బర్తుడే జ్ఞాపకం వుంచుకొన్న ధీశాలికి !

రాజ : క్షమించు.

రాణి : వాణితో, దాని పెళ్ళివిషయం ముచ్చటించే అవసరం ఏమొచ్చిందో !

రాజ : నేను ముచ్చటించలేదు.

రాణి : అవును. మా గొడవలు నీకెందుకు? నువ్వు స్వతంత్రుడవు. స్వేచ్ఛాజీవివి !

రాజ : అవును రాణీ—నేను స్వేచ్ఛాజీవినే—మరోలోకంలో పూర్ణిమ మరణంతో-కాని, యీ లోకం నన్ను సంకెళ్ళతో బంధించింది, చప్పుడుచెయ్యని సంకెళ్లు.

రాణి : గాఢంగా మాట్లాడుతున్నావే—

రాజ : గాఢంగా జీవించలేని వారి బ్రతుకు గూఢమే. అమ్మగార్ని చూసి వెడతా —

[లోపలి కెడతాడు, వెనక రాణీకూడా వెడుతుంది]

*　　　*　　　*　　　*

[చిట్టన్న ప్రవేశిస్తాడు. కేలండర్ కాగితాలు, మూడు తేదీలు చింపుతాడు]

*　　　*　　　*　　　*

[రాజశేఖరం తొందరగా నడిచివొస్తాడు]

చిట్టన్న : నమస్కారం బాబుగోరు.

రాజ : ఏం చిట్టన్నా, నా స్వంతనౌకరుగా వుండటానికి అభ్యంతరం వుంటుందా ?

చిట్టన్న : అంతకంటెనా బాబయ్యా.

[దూరంగా శాంతమ్మగారి మూలుగు వినబడుతూ వుంటుంది]

రాణి : ఏమన్నార్రా డాక్టర్‌గారు.

చిట్టన్న : ఆరు క్లబ్బులో సీట్లాడ్డానికి పోయారు. రాత్రొస్తారే, వెళ్ళమన్నారండి.

రాజ : నేనిప్పుడే పంపిస్తాను హరిహరాన్ని. రేపు కనబడు చిట్టన్నా.

చిట్టన్న : సిత్తం.

[రాజశేఖరం వెడతాడు. రాణి లోపలి కెళుతుంది. చిట్టన్న గ్రామఫోన్ మీద, విచారం సూచించే సైగల్ రికార్డు పెట్టి పడుంటాడు. తెర మెల్లగా సగం జారి, రెండు క్షణాల్లో మళ్ళా పైకిలేవాలి. చిట్టన్న కళ్లు నులుముకుంటూ లేచి, కేలండర్‌లో మరో తేదీ కాగితం చింపుతాడు. రాణీ, వాణీ ప్రవేశం.]

వాణి : ఎక్కడికే అక్కయ్యా ప్రయాణం ?

రాణి : అమ్మకి మందుకోసం.

వాణి : ఎందుకోసం యింత నుస్తాకించుకు, నేను నమ్మను.

రాణి : నమ్మకపోతే ఆంధ్రదేశాని కొచ్చిన లోటేమీలేదు.

వాణి : నిన్ను నువ్వు నమ్మకపోయినా ప్రమాదంలేదు. మరొకర్ని నమ్మావంటే నిజంగా ఆంధ్రదేశానికి కీడే సుమా. నువ్వు రాజశేఖరాన్ని చూడ్డానికోసం వెడుతున్నావు అవునా ?

రాణి : అవును. అక్కడికే వెడుతున్నాను ఏం ?

వాణి : ఎందుకు ?

రాణి. డాక్టర్ని తీసుకొని వొస్తానన్నాడు, రాలేదు. ఎందుకో కనుక్కొద్దామని.

వాణి : అతనికేం పనులున్నాయో—పెద్ద వుద్యోగి, నీ కెందు కతని జోలి ?

రాణి : నా జోలి నీ కెందుకూ ? అతనితో నీకేం జోలో, నాకూ అదేరకం జోలి, సరేనా ? అతనితో పెళ్ళిముచ్చట్లాడుకున్నావట !

వాణి : ఆడితే ఏం తప్పా ? నా పెండ్లికి రమ్మని ఆహ్వానించాను, నువ్వాడే ముచ్చట్లే నేనూను.

రాణి : వొళ్ళు దగ్గరపెట్టుకు మాట్లాడు వాణి ఆ అడుక్కుతినే వాడితో నాకేం ముచ్చట్లు !

వాణి : అంత అవసరం లేనిదానివి, ఎందుకెడుతున్నావు ? నీకు పెండ్లయింది—నువ్వే వొళ్ళు దగ్గరపెట్టుకో !

రాణి : నోర్ముయ్ ! నీకేకదా పెండ్లికాబోతోందని మహా ఆడి పోతున్నావ్ !

వాణి : పెండ్లైందికదా అని నువ్వే ఆడిపోతున్నప్పుడు, అవని దాన్ని నేనాడితే తప్పా ?

రాణి : ఛప్ ! (సాసర్ విసిరికొడుతుంది)

వాణి: హృదయాలు బ్రద్దలుకొట్టినదానివి నీకు సానుభూతి లెక్కా!

రాణి: (మొహం చేతుల్లో దాచుకొని ఏడుస్తుంది)

శాంతమ్మ: (లోపల్నుంచి) అయ్యో...మందు తెచ్చారా!... అల్లుడింకా ఆఫీస్‌నుంచి రాలేదూ .. మీరు కీచులాడుకుంటున్నారా?

వాణి: (బుజ్జగిస్తూ) వూరుకో అక్కయ్యా...ఇంకెప్పుడూ అనను. నేను స్వతంత్రుడైన తర్వాత, మనింట్లో బంట్రోతుగా వుంటాడా అతను- నీ వెర్రికాని...

రాణి: పో, పో, నువ్వు దూరంగాపో...స్వతంత్రుడు...పూర్ణిమ కొంగుతో కట్టిపడేసింది—బంట్రోతులాగా...

వాణి: ఆ కొంగుముండి విప్పేశావుగా......

రాణి: అయ్! వాణి (కంఠం పెద్దదిచేసి) నాకు కోపం తెప్పించకు—ఆవేశం వొస్తుంది సుమా. నన్నెరగవ్ — నారాయణ, కరుణాకరం రెడ్డి వాళ్లందరికంటె అతను ఎక్కువా! వాళ్ళు నే ఎట్లా చెబితే అట్లా వింటారే! ... వారాయి చేసుకుని బతికిన యీ పూల్ ... యీ దౌర్భాగ్యుడు...నన్ను ... (ఏడుస్తూ) నన్ను కాదని ... నన్ను తృణీకరిస్తాడా......(కదుల్తుంది)

వాణి: అక్కయ్యా, ఎక్కడికి? ఎక్కడి ?

చిట్టన్న: డాక్టర్‌గా రొస్తున్నారండి ..

రాణి: నన్ను...యీ పూల్

వాణి: అక్కయ్యా—ఆగు...ఆగు...

శాం: ఏమిట్రా అది...ఏమిట్రా...

[రాణి హాండ్ బాగ్ సవరించుకుని వాణి పట్టువిదిలించుకొని వెళ్ళిపోతుంది. వాణీ ఆయాసంతో సోఫాలో కూలిపోతుంది. తెర జారుతుంది.]

—o—

# ఆత్మవంచన

## రెండో రంగం.

[శేఖరం బంగళా — మధ్యాహ్నం మూడుగంట అవుతుంది. శేఖరం నాయుడు పైజామా, పొడుగుచేతుల లాల్చీ వేసుకుని ఈజీఛైర్‌లో వుంటాడు. రుమాలు ఊడీకొలోన్‌లో ముంచి నుదుటిమీద వేసుకొని, వొకొక్క చుక్కే పోసుకుంటాడు. రెండు మూడు కుర్చీలు, సోఫా, ఆఫీసుబల్ల, దాని మీద పూర్ణిమ ఫోటోస్టాండ్, మూల టేబిల్ మీద రేడియోసెట్టు వుంటాయి. తెర లేవగానే, మెల్లిగా రేడియో మోగుతుంటుంది. వెనకనుంచి గ్రామఫోన్ పెట్టొచ్చు — లేకపోతే, వాద్యసంగీతం వినిపించొచ్చు.]

(రెడ్డి ప్రవేశిస్తాడు)

రాజ : కమిన్ రెడ్డి, కూర్చో.

రెడ్డి : ఇవాళ ఆఫీసుకి రాలేదుట–ఒంట్లో బాగాలేదా ?

రాజ : మరేం లేదు, కొంచెం బద్ధకంగా వుంది. మీ సామాన్లు జాగ్రత్తగా చేరినట్లు తెలిసిందా ?

రెడ్డి : నిన్ననే ఉత్తరం వొచ్చింది. థాంక్స్ చెపుదామనొచ్చాను.

రాజ : రెడ్డీ, నీతో వో విషయం చెప్పాలి. ఎన్నడూ చెయ్యంది, నీ విషయంలో ఆనవ్యంగా చేస్తేగాని పని జరిగిందికాదు — నా మనస్సు పీకుతోంది.

రెడ్డి : నువ్వల్లా అనుకోగూడదు, అల్లాగైతేకాని పన్లు జరగవు— ఈ వుద్యోగస్థులందరూ నీలా ముక్కుకి సూటిగా వెడతారనుకోగూడదు.

రాజ : నిజం కావొచ్చు. ఎవళ్లో అల్లాచేశారు గదానని, మనం అల్లాగే చెయ్యాలన్నది మంచిసూత్రం కాదనుకుంటా. ఏదో జరిగిపోయింది. అల్లా చెయ్యడం యిదే ఆఖరుసారి రవకూడదూ ?

రెడ్డి : (నవ్వి) నీకు చిన్నప్పటినుంచీ చాదస్తం. స్వల్పవిషయాలలో పట్టుదల జాస్తి–చిట్టన్నకి మళ్ళా పనివేయించావుట–శాంతమ్మగారు చెప్పింది.

రాజ: నే వేయించేదేమిటి? ఆ భగవంతుడే వేయించాడు.

రెడ్డి: ఏం యీపూట వేదాంతంలో పడ్డావు?

రాజ: ఏమీలేదు రెడ్డీ, నాకు నామీద నమ్మకం పోతూంది.

రెడ్డి: అంటే?

రాజ: మనని మనం నమ్మలేకపోతే యితరులనీ నమ్మలేం. అట్లాంటప్పుడు జీవితం అర్థశూన్యంగా కనిపిస్తుంది,

రెడ్డి: ఇప్పు డేం జరిగింది.

రాజ: నువ్వంటే నా కెంతో గౌరవం, చిన్నప్పటినుంచీ. అంచేత చెబితే అర్థంచేసుకుంటా వనుకుంటాను.

రెడ్డి: తప్పకుండా, ఒకప్పుడు నే నేమో అనుకున్నానుగాని యిప్పుడు నా అభిప్రాయం మార్చుకున్నాను - రాజా.

రాజ: నా మూలాన వో అమాయకురాలు నిష్కారణంగా చని పోయింది.

రెడ్డి: అదేమిటి? ఎవరు?

రాజ: పూర్ణిమని — బెంగాల్‌లో ఆ అమ్మాయితో స్నేహం కలిసింది. నే నామెను మోసగించానని ఆత్మహత్య చేసుకొంది. నా కామె తప్ప యీ లోకంలో ఎవ్వరూ లేరనుకునేవాడిని—నా కెట్లా వుంటుంది?

రెడ్డి: ఎందుకట్లా చేసింది?

రాజ: నే నావిషయం చెప్పలేను, రెడ్డీ, నాకింక జీవితంలో శాంతి వుండదనుకుంటాను, నా కేకాదు—నాతో నిమిత్తం వున్నవాళ్ళకి కూడా శాంతి వుండదు.

రెడ్డి: నా కర్థంకావడంలేదు. సూర్యనారాయణ విషయమా?

రాజ: నువ్వు సరిగ్గా వూహించావు,

రెడ్డి: దానికేమిటి—నువ్వు మరెవర్నైనా పెండ్లిచేసుకుని ట్రాన్స్ ఫర్ చేయించుకున్నావంటే ఏ గొడవా వుండదు.

రాజ: నువ్వనుకున్నంత సింపిల్ కాదు రెడ్డీ, నాకు మళ్ళా వుంకోర్ని ప్రేమించడం చేతకాదు, చేసుకున్నా ఆమె జీవితం దుర్భరం అవుతుంది, నాతోబాటు వాళ్లూ అక్కడికే ట్రాన్స్ఫర్ అవుతారు!

రెడ్డి. నువ్వన్నీ వూహించుకుని బాధపడుతున్నావు, అంతే. ప్రపంచంలో బ్రతకాలంటే కొంత కుట్ర, నటన అవసరం రాజా — నువ్వు అవన్నీ అలవర్చుకోలేకపోతే ఎప్పుడూ యిట్లాగే వుంటావు.

రాజ: అవుతే మృత్యువుతప్ప నాకు వేరే విముక్తి లేదన్నమాట.

రెడ్డి: ఏంమాటలవి, ఆడదానికి మల్లే?

రాజ: స్త్రీలకున్న తెగింపు నాకుంటేనా?

రెడ్డి: అదేమిటి అల్లా వులిక్కిపడ్డావు?

రాజ: ఏమీలేదు—ఎవరో వొచ్చినట్లున్నారు.

[రెడ్డి బైటికివెళ్ళి చూస్తాడు]

రెడ్డి: మీ పనిచేసే కుర్రాడు.

రాజ: ఏం పనిలేదు: సినిమాకి పొమ్మనిచెప్పు. వాణ్ణి.

రెడ్డి: నే వెడతా మరి—మరిచాను, వాణీ. గోపాలం మారేజ్ స్థిరపడిందటగా?

రాజ: అల్లాగా—పాపం శాంతమ్మగారి కీపూట ఎల్లావుందో?

రెడ్డి: ఈ వుదయం పథ్యం తీసుకుందిట.

[వెడతాడు, కాసేపు నిశ్శబ్దం]

[రాణి వొస్తుంది — కళ్లు ఎర్రగా వుంటాయి — జుట్టు కొద్దిగా రేగి వుంటుంది.]

రాజ: కమిన్ రాణీ; మంచి సమయానికొచ్చావ్ — టీ టైమ్, — నేనూ యిప్పుడే వొచ్చా ఆఫీసునుంచి—ఇంకా నారాయణగారు యింటికి రాలేదూ?

రాణి: ఇంటిదగ్గరమంచి రావడంలేదు...కాదు, కాదు...యింటి దగ్గరనుంచే.

రాజ : ఏం రాణీ—షైరయినట్లు కనిపిస్తున్నావు. కాసేపు రెస్టు తీసుకో. ఉండు, లెమన్ కలిపిస్తాను. పుచ్చుకో—కళ్లు వాచినట్లున్నాయి.

రాణి : లేదు. ఏం లేదు.

రాజ : నారాయణగార్నిగూడా తీసుకురాలేక పొయ్యావా? ఉండు. బిస్కెట్స్ తీసుకొస్తాను. ఇవాళ మా బోయ్‌లేడు: సినిమాకి పొమ్మన్నాను.

రాణి : నే యిప్పు డొస్తానని తెలుసా?

రాజ : ఎప్పు డొస్తావో తెలీదుగాని, ఎక్కణ్ణించి వొచ్చావో తెలుసు!

రాణి : ఇంటిదగ్గరనుంచే.

[హాండ్ బాగ్ సర్దుతుంటే ఏదో కాగితం క్రింద పడుతుంది]

రాజ : మందులషాపునుంచి వొచ్చావు.

రాణి : నీ కెల్లా తెలుసు?

రాజ : అదుగో బిల్లుచీటి క్రిందపడింది:

రాణి : ఇదా—మా అమ్మకి మందు కొన్నాను.

రాజ : ఎల్లావుంది వారికి—?

రాణి : రాత్రి చూడ్డానికి వొస్తానని రాలేదేం?

రాజ : తీరిలేదు. కాగితాలూ అవీ చూసేటప్పటికి పదైంది — రేడియో అల్లా వింటూ నిద్రపొయ్యాను. ట్యూన్ చెయ్యనా? వారు లేచి తిరుగుతున్నారా?

రాణి : అల్లాగే వుంది. ఎల్లావుండేదీ నీకు నిజంగా కావాలా?

[వెనకాల రేడియోపాట వినబడుతూ వుంటుంది]

రాజ : నే నేది చెప్పినా నువ్వు నమ్మలేవు. రాణీ — చిన్నప్పటి నుంచీ మీ యింట్లో వున్నాను నా కామాత్రం కృతజ్ఞత వుండటం అసహజమా?

రాణి : ఉన్నట్లు ఋజువు దొరకలేదులే.

రాజ : రాణీ, ఈనాటితో నే నో గొప్ప జీవితరహస్యం తెలుసుకున్నాను. అది నీకు కావాలంటే చెప్పేస్తాను.

రాణి: ఈ పూట చిత్రంగా మాట్లాడుతున్నావే! ఏమిటా రహస్యం?

రాజ: మనుషులు ఎందుకు ద్వేషిస్తారో?

రాణి: ఆ ప్రశంస దేని కిప్పుడు?

రాజ: మనుషుల హృదయంలో ఎందుకు ప్రేమవుండదో తెలుసుకున్నాను,

రాణి: ఎందుకో:

రాజ: వారికేం కావాలో తెలీక—తెలిస్తే దాన్ని సాధించటానికి యత్నిస్తారు: తెలీకపోవడంవల్లే యీ ఆవేదన. నీకేం కావాలో చెప్పు, యివ్వగలిగిందైతే యిస్తాను,

రాణి: ఇవ్వకూడనివికూడా వుంటాయా?

రాజ: అది నీకు తెలియాలి,

రాణి: నువ్వు నా కిచ్చే దేమిటి? మేమే యిన్నేళ్లూ నీ కిచ్చాం.

రాజ: దానికి నీ కోరికప్రకారం బదులు యివ్వలేకపోయాను. అంతేనా? రాణీ, నిన్ను చూస్తే జాలేస్తోంది. నువ్వు పుచ్చుకునే స్థితిలో లేవు, నా జీవితం ట్రాజెడీ అయింది. కాని, అందమైన, వుదాత్తమైన ట్రాజెడీని యిప్పుడు హాస్యాంతం చెయ్యకు.

రాణి: నే నేంచేశా నిప్పుడు—?

[బాగ్ మళ్లా తడుముతుంటే ఏదో పొట్లం పడుతుంది]

రాజ—ఆదేవిటో పొట్లాం పడిపోయినట్లుంది — అమ్మగారికి మందు పొట్లంకాబోలు.

రాణి—అవును, యిలాతే, (లాక్కుంటుంది)

రాజ: తీసుకో—వెళ్ళి, పాపం ఆవిడకి యిచ్చిరా, పోనీ, మనం వెళ్ళి యిచ్చివొద్దామా?

రాణి: యీ పూటకి మందుంది. నన్ను చూసి జాలిపడనక్కర లేదువే

రాజ: రాణీ...నిజంగా జాలేస్తోంది. నిష్కారణంగా వొక అమాయకురాలి మృత్యువుకు కారణం అయ్యావు, నేను నీకోసం షిల్లాంగ్‌నుంచి యిక్కడికి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నా ననుకుంది పూర్ణిమ.

రాణి: అది అబద్ధమని నాతో చెప్పనక్కర్లేదు. నీ మాటలు నాకు అర్ధంకావడంలా,

రాజ: నీక్కావాల్సింది పొందలేకపోయ్యావు. నేను నీకేమీ యివ్వలేని స్థితిలో బెట్టావు నన్ను.

రాణి: నా డబ్బు నా మొహాన పారేశావుగా!

రాజ: డబ్బా? అదొక్కటే నీ కక్కరలేంది, పొగడ్త, స్నేహం, ఆప్యాయం, ఆంతరంగికం—అవి కావాలి—వాటిని నేను యివ్వలేను, నా జీవరికం మనిద్దరిమధ్యా గోడలా వుంది; అది నువ్వు దూకలేవు; నేను పడగొట్టలేను. ట్రాజెడీ కాదూ? కాఫీకలిపి తీసుకొస్తా—

[లోపలికెళ్ళి రెండు కప్పులతో కాఫీ తీసుకొస్తాడు]

రాజ: డిలేచేశాను, క్షమించు — అదేమిటి, ఫ్యాన్ పెట్టుకున్నా చెమట్లు పోస్తున్నాయి?—ఏం? రాణీ, వొంట్లో బాగాలేదా?

రాణి: అబ్బే, ఏంలేదు, బాగానే వున్నాను. నీ చమత్కారం మాట్లకి అర్థం తెలుసుకుంటున్నాను.

రాజ: నీకు అర్థంకాకనా—రాణీ—? నిన్ను గురించిన సత్యం నీకు తెలుసు. కాని దాన్ని ఎదుర్కోలేవు.

రాణి: తెలివిగా మాట్లాడా ననుకుంటున్నావా? నాకేం కావాలో తెలుసు. నారాయణ్ణి ప్రేమించి, పెండ్లిచేసుకున్నాను. నిన్ను ప్రేమించా ననుకుంటే, చాలా పొరబడ్డావు

రాజ: రాణీ, వుద్రేకం తెచ్చుకోకు, నువ్వు ఎవర్ని ప్రేమించావన్నా నేను నమ్మను, నువ్వు ప్రేమించేది వొక్క వ్యక్తే — ఆ వ్యక్తి నువ్వే!..

రాణి: అంతా అబద్ధం, దొంగమాటలు నీవి. నీకు అధికారం, డబ్బు తలకెక్కి, గర్వించి—

రాజ: ఇస్—రాణీ! ఎవర్నీ నువ్వు ప్రేమించలేవు. అల్లా అనుకోడం ఆత్మవంచన అమ్మయ్య! నా మనస్సు యిప్పుడు ప్రశాంతంగా వుంది, సంగీతం విను—వొక్కసారి ముసుగు తీసేసి, నీ నిజస్వరూపం ప్రదర్శించు.

రాణి: ఏం చిత్రంగావుంది నీ కథ—!

రాజ: షుగర్ తక్కువైందా—ఉండు, తీసుకొస్తాను.

[లోపలి కెడతాడు. అతను లేనప్పుడు రాణి బాగ్‌లోంచి వో పొట్లం తీసి, కప్పులో పొయ్యబోతుంది. కాని పొయ్యదు ...... తీసేసి, బాగ్‌లో పోస్తుంది బాగ్ కిందపడుతుంది, రాజా వొస్తాడు.]

రాజ: రాణీ, నా కథ యింతటితో సమాప్తమైంది. ఇదే ఆఖరి కప్పు—నే స్వయంగా కలుపుతున్నది. నువ్వు నన్ను డబ్బుపేరిట వశం చేసుకుందా మనుకున్నావు. సాంఘిక పరిస్థితులు అడ్డుతగిలాయి. నా మనస్సు అపహరిద్దా మనుకున్నావు—అది వీలుపడలేదు. ఇప్పుడు నన్ను చంపి, నా శరీరంపై నైనా విజయం పొందుదా మనుకున్నావు — రాణీ! (ముందుకు వొరుగుతాడు)

రాణి: ఆ—ఆ—రాజా—ఏమిటది!

రాజ: రాణీ, నీ కా అవకాశం లేదు, నన్ను నేనే చంపుకోవాలి. నేను బ్రతికివుంటే నీకు సుఖం లేదు, కడసారి త్యాగం చేస్తున్నాను.

[రాణి అతని బుజం పట్టుకుని వూపుతూ, ఏడుస్తూంటుంది]

రాజ: నావుద్యోగం మీఆయనకిస్తారు. నీకేం భయంలేదు. భర్తతో సుఖంగా వుండు. ఇంకైనా—నాజేబులో వుత్తరం వ్రాసిపెట్టా నిన్నెవ్వరూ బాధించరు.

[పూర్తిగా ముందుకి పడిపోతాడు. అతన్ని వెనక్కివాల్చి, దిండ్లు పెడుతుంది]

# ఆత్మవంచన

వాణి : రాజా, రాజా—ఒక్కమాట—నిజం చెబుతాను !

రాజ : నా ఋణం తీర్చుకున్నాను.

[ మరి కదలుడు ]

[వాణి ఏడుస్తుంది. రాజాకేసి చూసి, కాసేపు ఏడ్చి అక్కణ్ణుంచి వోదారుస్తూ లేవదీస్తుంది]

వాణి : లే, లే; మనం యిక్కడుండ కూడదు. రా, యింటికి పోదాం. బావొచ్చేవేళ:

రాజ : శేఖరం వచ్చిపోయ్యాడు ... అతన్ని నేనే చంపేశాను. నేనే...అతన్ని చంపటానికొచ్చానను కున్నాడు...నేనుచంపి వుండను, ...చంపలేను...అతనికి తెలీదు. ...నేనా అతన్ని చంపడం...; కాని నేనే...చంపేశాను...

వాణి : ఉస్ ...మెల్లగా...గట్టిగా అనకు...ఇప్పుడేనా పదండి ...రా. పోదాం...రాజశేఖరం (అతనికేసి చూస్తూ) యిప్పుడు నిజంగా సుఖపడ్డాడు......స్వేచ్ఛాజీవి.........

( తెర )

సమాప్తం.



కిసాన్ ప్రెస్, విజయవాడ — 2.